Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 17 • 23-4-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-







## జెసి మీద భారం

తెలంగాణ ప్రాంతంలో జరగనున్న 12 శాసనసభ స్థానాల ఉపఎన్నికల భారాన్ని అనంతపురం జిల్లా నేత జెసి.దివాకర్‌రెడ్డి మీద మోపాడు ముఖ్యమంత్రి రోశయ్య. విచిత్రమైన నిర్ణయం ఇది. తెలంగాణలో కాంగ్రెస్‌కు కో అంటే కోటి మంది నేతలున్నారు. వారిలో కొందరు ముఖ్యమంత్రికి సన్నిహితులు కూడా. అసలు పిసిసి అధ్యక్షుడే తెలంగాణ నేత. అయినా సరే ఈ బాధ్యత మాత్రం జెసి.దివాకర్‌రెడ్డి మీద మోపాడు ముఖ్యమంత్రి.

మొత్తం 12 స్థానాలలో కనీసం రెండింటినైనా గెలవాలన్నది ముఖ్యమంత్రి లక్ష్యం. తెలంగాణ ఏర్పాటు కోసం టిఆర్ఎస్ ఎమ్మెల్యేల పదవీత్యాగం వల్ల జరుగుతున్న ఉప ఎన్నికలివి. అందువల్ల సహజంగానే వారిపట్ల ప్రజలకు సానుభూతి వుంటుంది. అన్ని స్థానాలను వారే గెల్చుకోవడం సహజ పరిణామం. అయితే వీటిలో రెండు లేదా మూడు స్థానాలలో అయినా టిఆర్ఎస్‌ను ఓడించి, కాంగ్రెస్ జెండా ఎగురవేయగలిగితే, ఢిల్లీలో తన ప్రతిష్ట పెరగడంతోపాటు, తెలంగాణ వేర్పాటు పట్ల ప్రజలలో అంత సానుకూలత

కొరవ 14వ పేజీలో

# మంత్రివర్గ విస్తరణ హుళక్కే!

## ● ప్రజాపథంలో మంత్రులు, ఎమ్మెల్యేలు పాల్గొననే ఈ ప్రకటన.

రాష్ట్ర మంత్రివర్గ విస్తరణ ఇప్పట్లో జరిగే సూచనలు కన్పించడం లేదు. త్వరలోనే ఈ ముచ్చట తీరుస్తారని ప్రజాపథం సభలో ముఖ్యమంత్రి చేసిన ప్రకటన కేవలం కంటితుడుపు చర్యగా మాత్రమే భావిస్తున్నారు పరిశీలకులు. తాను ముఖ్యమంత్రి అయిన నాటి నుంచి ప్రభుత్వానికి, ప్రజలకు మధ్య సంబంధాలు తెగిపోయాయన్న నిందను తొలగించుకోవడానికి ప్రజాపథం కార్యక్రమం తలపెట్టాడు ముఖ్యమంత్రి. అయితే అందులో మంత్రులు, ఎమ్మెల్యేలు ఎంతవరకు పాలు పంచుకొంటారన్న అనుమానం తలెత్తింది. ఢిల్లీ పర్యటన తర్వాత మంత్రివర్గ విస్తరణ లేదని స్పష్టం కావడంతో, జగన్ అనుకూలురైన మంత్రులలో మరొకసారి లెక్కలేనితనం పెరిగింది. ముఖ్యమంత్రి తమనేమీ చేయలేడన్న ధీమా పెరిగింది. దానితో ఆయన మాట విని ప్రజాపథంలో పాల్గొనే సూచన కన్పించడం లేదు. ఈ ప్రమాదాన్ని నివారించడం కోసమే రోశయ్య కావాలని మంత్రివర్గ విస్తరణ ప్రస్తావన తెచ్చాడు. పైపెచ్చు జగన్ అనుకూలురులను భయపెట్టడానికి, ఒట్టి విస్తరణ కాదు, పూర్తిస్థాయి ప్రక్షాళన చేస్తానని ప్రకటించాడు. ప్రక్షాళన అంటే అర్థం, తనను లెక్కచేయని వారిని పీకి పక్కన పడేస్తానని. దానితో జగన్ అనుచర మంత్రులందరూ ఉలిక్కిపడ్డారు. రాత్రికి రాత్రి అందరూ తమ తమ జిల్లాలకు ప్రయాణం కట్టారు. ముఖ్యమంత్రి ప్రకటన వెలువడిన పక్కరోజు నుంచి సెక్రటరియేట్‌లో ఒక్క మంత్రి కన్పించడం లేదు. సిఎల్పీ కార్యాలయంలో ఒక్క ఎమ్మెల్యే జాడ లేదు. రెండు కీలక ప్రదేశాలు బోసిపోయి వున్నాయి.

అయితే నిజంగానే మంత్రివర్గ ప్రక్షాళనకు ముఖ్యమంత్రి సిద్ధపడుతున్నాడా, లేక ప్రజాపథం కోసం బెదరించాడా అన్నది ప్రశ్న. ఆ రెండవ అభిప్రాయమే వాస్తవమని చెప్పవచ్చు. ముఖ్యమంత్రి ఎదుట మంత్రివర్గం కంటే కీలకమైన రాజకీయ సవాళ్లు చాలా వున్నాయి. నెలరోజులలో జరగనున్న తెలంగాణ ప్రాంత ఉపఎన్నికలు ఆ వరసలో మొదటివి. ఆ పిమ్మట మునిసిపల్ ఎన్నికలున్నాయి. దివాళా స్థితిలో వున్న రాష్ట్ర ఆర్థికపరిస్థితిని చక్కదిద్దుకోవడానికి విద్యుత్ చార్జీల పెంపకం వంటి కఠిన నిర్ణయాలు తీసుకోక తప్పడం లేదు. ఇది ప్రజలలో తీవ్ర నిరసనలకు దారితీసే ప్రమాదం వుంది. ప్రతిపక్షాలు ఉద్యమాలు చేపట్టడానికి అదొక ఉపకరణం. ఇన్ని సమస్యల మధ్య మంత్రివర్గ ప్రక్షాళన చేసి, రాజకీయంగా సమస్యలు తెచ్చుకోవడం ఎందుకనే ఆలోచనలో వున్నాడట ముఖ్యమంత్రి. వున్న మంత్రులను తీస్తే, అసమ్మతి




కొరవ 14వ పేజీలో

## రోశయ్య మీద డిఎస్ రుసరుస!

పిసిసి అధ్యక్షుడు డి.శ్రీనివాస్‌కు, ముఖ్యమంత్రి రోశయ్యకు మధ్య దూరం పెరిగిపోతున్నది. ఇద్దరి మధ్య మాటలు చాలా పొదుపుగా మారుతున్నాయి. ఎంతో అవసరం వుంటే తప్ప ఒకరిని ఒకరు కలవడం లేదు. ఫోన్‌లో మాట్లాడుకోవడం కూడా అరుదై పోతున్నది. శాసనమండలి ద్వారా రోశయ్య మంత్రివర్గంలోకి ప్రవేశించాలన్నది డిఎస్ ఆశ. అందుకోశం ఆయన చాలాకాలం నుంచి ప్రయత్నం చేస్తున్నాడు. శ్రీకృష్ణ కమిటీ నివేదిక తెలంగాణాకు అనుకూలంగా వస్తే రాష్ట్రంలో ఏర్పడే రాజకీయ సంక్షోభంలో తనకు ముఖ్యమంత్రి అయ్యే అవకాశం లభించాలంటే, తాను మంత్రివర్గంలో వుండాలన్నది డిఎస్ వ్యూహం. ఇది గ్రహించిన రోశయ్య, శాసనమండలి టిక్కెట్ల విషయంలో డిఎస్‌కు మోకాలు అడ్డుపెట్టాడు. తనకు శాసనమండలి టిక్కెట్ రాకపోవడానికి రోశయ్య

కొరవ 14వ పేజీలో



## కార్టూన్ స్పేస్




స్టౌమీదైతే లేటవుతుంది...
ఇలాగయితే ఐదు నిమిషాల్లో వడ్డించేస్తానండి..!

# కరెంటు వాత

"బషీర్‌బాగ్ దుర్ఘటనలో దుర్మరణం పాలైన నిర్భాగ్యుల ఆత్మల మీద ప్రమాణం చేసి చెప్తున్నాను – రానున్న ఐదేళ్లలో రాష్ట్రంలో విద్యుత్ చార్జీల పెంపు అన్నది జరగదు"... 2009 ఎన్నికలకు ముందు అప్పటి ముఖ్యమంత్రి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి శాసనసభలో గంభీరంగా చేసిన ప్రకటన ఇది. విద్యుత్ పరిస్థితి మెరుగుపరచడానికి తన ప్రభుత్వం వేలాది కోట్లు ఖర్చు పెట్టిందని, మరొక 34వేల కోట్ల పెట్టుబడితో కొత్తగా 8960 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తికి ప్రాజెక్టుల నిర్మాణం జరుగుతుందని, అందువల్ల ఆంధ్రప్రదేశ్‌లో విద్యుత్ కొరత అన్న మాట ఇక వినపడదని నమ్మకంగా ప్రకటించాడాయన. ఎన్నికలు గడచిపోయాయి, రాజశేఖర్‌రెడ్డి కూడా దురదృష్టవశాత్తు అమర జీవిగా మారిపోయాడు. ఆయన పథకాలు, కార్యక్రమాలు అక్షరం పొల్లు పోకుండా అమలు చేయడమే తన కర్తవ్యమని పదే పదే బాసలు చేస్తున్న కొత్త ముఖ్యమంత్రి రోశయ్య ఒకేసారి 2600 కోట్ల రూపాయల మేర విద్యుత్ చార్జీల పెంపకానికి ప్రతిపాదనలు తయారు చేశాడు. తెలంగాణలో 12 శాసనసభ స్థానాలకు ఉపఎన్నికలకు, ఆ వెంటనే రాష్ట్రం మొత్తం మీద మునిసిపల్ ఎన్నికలు పొంచివున్న సమయంలో ఇళ్ల వాడకంపై చార్జీ పెంచితే జనం దుమ్మెత్తి పోస్తారని భయపడి ఆ ఒక్క రంగాన్ని మినహాయించారు. పరిశ్రమలు, వాణిజ్య వాడకానికి ఒక్కొక్క యూనిట్‌కు 50పైసల నుంచి రూపాయ వరకు పెంచాలన్న నిర్ణయం తీసుకొన్నారు. విద్యుత్ రెగ్యులేటరీ కమిషన్ ఆయన ప్రతిపాదనలను యథాతథంగా ఆమోదిస్తే, ఆగస్టు నెల నుంచి విద్యుత్ చార్జీలు అమాంతం పెరిగిపోతాయి. రాష్ట్ర విద్యుత్ రంగ చరిత్రలో ఒకేసారి ఇంత భారీ మొత్తంలో చార్జీలు పెంచిన సాదృశ్యం వేరొకటి లేదు. తెలుగుదేశం పార్టీ గత రెండు ఎన్నికలలో దారుణమైన ఓటమి చవి చూడడానికి 2002లో చంద్రబాబు నాయుడు పెంచిన విద్యుత్ చార్జీలు ఒక కారణమన్న నిజాన్ని ఎవరూ కాదనలేరు. అప్పట్లో ఆయన పెంచిన మొత్తం ఐదు వందల కోట్లు కూడా లేదు. ఆ చిన్న పెరుగుదల, బషీర్‌బాగ్ దారుణానికి దారి తీసింది. చంద్రబాబు నాయుడును ప్రతిపక్షనాయకుడిగా మార్చింది. ఇప్పుడు రోశయ్య ఆనాటి కంటే నాలుగు రెట్లు అధికంగా కరెంటు వాత పెట్టబోతున్నాడు.

దేనివల్ల ఈ పరిస్థితి? తెలుగుదేశం హయాంలో విద్యుత్ సంస్కరణలు ప్రారంభించినప్పుడు ప్రభుత్వం చాలా మాటలు చెప్పింది. విద్యుత్ పంపిణీలో వస్తున్న నష్టాల వల్లనే విద్యుత్ సంస్థలు అప్పుల ఊబిలో కూరుక పోతున్నాయని, దాన్ని నివారించడానికి పంపిణీ వ్యవస్థను ఆధునీకరిస్తున్నామని అప్పుడు చంద్రబాబు, ఆ తర్వాత వైఎస్ కూడా చెప్పారు. కానీ వాస్తవంలో అది జరగలేదు. విద్యుత్ పంపిణీ నష్టాలు ఇప్పటికీ 23 నుంచి 25 శాతం వరకు అట్లనే నడుస్తున్నాయి. దాన్ని సరిదిద్దుకోలేక పోవడం రాష్ట్ర ప్రభుత్వ చేతకానితనం. చవకగా విద్యుత్ ఉత్పత్తి చేసే ప్రాజెక్టుల నిర్మాణంలోనూ రాష్ట్ర ప్రభుత్వం అలసత్వం వహించింది. ప్రైవేటు కార్పొరేట్ సంస్థలను మాత్రమే ప్రోత్సహించి, వారికి కళ్లు తిరిగే ధరలు చెల్లించి కరెంటు కొనుగోలు చేస్తున్నారు. ఎపి జెన్‌కోను నిర్వీర్యం చేశారు. హైడల్ విద్యుత్ ఉత్పత్తిని ఎప్పటికప్పుడు పెంచివుంటే, పావలా కంటే తక్కువగా యూనిట్ విద్యుత్ ఉత్పత్తి అవుతుంది. దానితో వ్యవసాయ రంగం మొత్తానికి ఎన్నేళ్లపాటైనా నాణ్యమైన విద్యుత్ ఇవ్వవచ్చు. థర్మల్ విద్యుత్ రంగంలో ఎపి జెన్‌కో ప్రాజెక్టులు కేవలం రెండు రూపాయలకే విద్యుత్‌ను ఉత్పత్తి చేస్తున్నాయి. కానీ అదే ప్రైవేట్ రంగంలోని థర్మల్ విద్యుత్ కేంద్రాల నుంచి 2 రూపాయల యాభై పైసల నుంచి 7 రూపాయల వరకు ధర చెల్లిస్తున్నది ప్రభుత్వం. దీనివల్ల విద్యుత్ కొనుగోలు సగటు ధర అమితంగా పెరిగిపోతున్నది. విద్యుత్ సంస్థలు నష్టాలలో కూరుకుపోతున్నాయి.

విద్యుత్ సంస్కరణలు ప్రవేశపెట్టిన పదేళ్ల తర్వాత కూడా ప్రభుత్వాలు వాటిపై చిత్తశుద్ధి ప్రదర్శించకపోవడం వల్లనే ఈ దుర్గతి. ఎప్పటికప్పుడు అవసరాలకనుగుణంగా కొత్త ప్రాజెక్టులతో ఉత్పత్తి పెంచడం, సరఫరా నష్టాలు తగ్గించుకోవడం చేసివుంటే ఎప్పటికీ ధరలు పెంచవలసిన అవసరం ఏర్పడేది కాదు. అదేమీ చేయకుండా మొత్తం భారాన్ని ప్రజల మీద రుద్దాలనుకోవడం ప్రభుత్వం చేస్తున్న అన్యాయం.

జమీన్‌రైతు

## జనవాణి

### గ్రామ స్వరాజ్యం

కేంద్రంలోని యుపిఏ ప్రభుత్వ పాలన బేషుగ్గా వుంది. సోనియాగాంధీ పర్యవేక్షణలో ప్రధాని మన్మోహన్‌సింగ్ పరిపాలన పారదర్శకంగా వుండాలని సమాచార హక్కు చట్టం, గ్రామస్థాయిలో ప్రతి ఒక్కరికి ఉపాధి కల్పించాలని ఉపాధి హామీ పథకాన్ని ప్రవేశపెట్టారు. దీనివల్ల గ్రామస్థాయిలో వలసలు తగ్గి పేద కుటుంబాలలో కొనుగోలు శక్తి పెరిగి వారి కాళ్లపై వాళ్లు నిలబడగలుగుతున్నారు. ఈ యేడాది ప్రవేశపెట్టదలచిన నిర్బంధ విద్య, ఆహార భద్రత హక్కులు గ్రామస్థాయిలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకవస్తాయి. మన రాష్ట్రంలో అమలు జరుగుతున్న రాజీవ్ ఆరోగ్యశ్రీని దేశం మొత్తానికి విస్తరింపజేసి ఆరోగ్య భద్రత కల్పించాలి. జిల్లాస్థాయిలో ప్రభుత్వ యంత్రాంగం ఈ పథకాలను క్షేత్రస్థాయిలో అమలు చేస్తే గాంధీజీ కలలుగన్న గ్రామ స్వరాజ్యం ఎంతో దూరంలో లేదు.

ఆర్.రాంబాబు, నెల్లూరు

### ఎస్పీ అభినందనీయుడు!

నెల్లూరు ట్రాఫిక్ అబందరగా తయారైన విషయం నగర ప్రజలందరికీ తెలుసు. ఈ ట్రాఫిక్‌ను గాడిలో పెట్టేందుకు ఎస్పీ దామోదర్ చేపడుతున్న చర్యలకు కొన్ని రోజుల్లోనే ఫలితాలు కనపడతాయి. ట్రాఫిక్‌ను నియంత్రించును ఒక మొబైల్ పోలీసు వ్యాను ఏర్పాటు చేయబోతున్నట్లు పత్రికల్లో చదివాను. ఇదెంతో ముదావహం. గుజరాత్‌లోని సూరత్‌ను ఎస్.ఆర్.రావు అనే ఐఎఎస్ అధికారి సుందరనగరంలా తీర్చిదిద్దారు. అందరూ సహకరిస్తే నెల్లూరులోని ట్రాఫిక్ సమస్యలను ఎస్పీ పరిష్కరించగలరనే నమ్మకం కలుగుతుంది.

ఏ.వి.కృష్ణారెడ్డి, నెల్లూరు

### కులాలు... మతాలవారీగానా?

ప్రజాసేవ చేసిన వారిని సన్మానించడం, వారు స్వర్గస్తులైన తర్వాత విగ్రహాలు పెట్టడం, సంస్మరించుకోవడం మంచి సాంప్రదాయం. దీనికి రాజకీయ రంగు, కులం, మతం పులిమి చేసే కార్యక్రమాలు చూస్తే ఏవగింపు కలుగుతోంది. నెల్లూరు జిల్లాలో ఎంతోమంది సంస్కర్తలు, ఉద్యమకారులు కులమతాల కతీతంగా సేవచేసి కాలగర్భంలో కలసిపోయారు. అటువంటి వారిలో వెన్నెలకంటి రాఘవయ్య, పొణకా కనకమ్మ, నెల్లూరు వెంకట్రామానాయుడు, కటికనేని కళ్యాణరావు, పెట్లూరు గోవిందరెడ్డి, బద్దెపూడి వెంకట నారాయణ

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

26-4-1940
పేజీలు : 16 వెల: అణా

### మన కొమ్మారెడ్డి అస్తమయం

ఆంధ్ర రాష్ట్ర రైతుసంఘం అధ్యక్షత్వమును, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ సహాయ కార్యదర్శిత్వమును, చిరకాలము సమర్థతతో నిర్వహించి రైతు లోకమునకు చిరస్మరణీయ సేవగావించిన కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి గారు తెలియని వారుండరు.

ఈయన మహోన్నత విద్యలో ఆరితేరినవాడు కాదు. యూనివర్శిటీ విద్య అసలే లేదు. కానీ ఎంతో క్రమశిక్షణాయుతమైన జీవితము గలవాడు. ఆయన తన జీవిత మందలి చివరి 3, 4 సంవత్సరాలు రైతు సేవకై ధారపోశాడు. బాహుదా నదీ తీరమందున్న యిచ్ఛాపురము నుండి బయలుదేరి, కాలి నడకన మద్రాసు వరకూ, రైతు సేవా దళనాయకుడుగా రైతురక్షణ యాత్రను సాగించి, రాష్ట్రమంతా రైతు సంచలనము కలిగించాడు.

ఈయన స్వగ్రామమైన పోతనూరులో 19వతేది మరణించినాడను వార్తకు రైతు సంఘాలేగాక సామ్యవాద యువ నాయకుడు దివంగతుడగుట దురదృష్టమును సూచించును.

### సినిమా

కొన్ని మాసాల క్రితం ఆంధ్ర సినీటోన్ అనే పనివాండ్ల తరపున ఒక ప్రతినిధి విశాఖపట్నం నుంచి మద్రాసుకు వచ్చి ఫిలిమ్ ఛాంబర్ అధ్యక్షుడు సత్యమూర్తి గారి దర్శనం గోరి చీటి పంపితే "పనిమీద వున్నాం దర్శనానికి వీల్లేదని" రిప్లయి వచ్చిందట. 970 మైళ్లు రూ 19–4–0 రైలు ఛార్జి తగులబెట్టి వచ్చిన పెద్దమనిషికి దేశారాధకుని దర్శనం కూడా కాలేదంటే ఇక జమీందార్ల గూర్చి అనుకోవాలనా అంటా?

ఎందుకండీ లీగ్ ఆఫ్ నేషన్స్ వంటి ఈ ఫిలిం ఛేంబరు?

## 50 ఏళ్ల క్రితం ఈవారం

22-4-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### కావలి ఉపఎన్నిక – ప్రజాపార్టీ పోటీ ప్రయత్నం!

5వ తేదీ జరిగిన తాలుకా ముఖ్యుల సమావేశంలో కాంగ్రెస్ అభ్యర్థిగా రేబాల దశరధరామిరెడ్డి గారి పేరు అధిక సంఖ్యాకులచే ఆమోదింపబడింది. ఇక కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు ఆమోదం పొందవలసి వున్నది.

దశరధరామిరెడ్డి గారి పేరు తప్ప, మరొక పేరు ప్రస్తావనకు రాకపోయినా, స్థానిక కాంగ్రెస్‌వాదుల వైఖరిచూస్తే, తమ తాలుకాకు చెందిన అభ్యర్థి ఎవరైనా వుంటే బాగుండుననే అభిప్రాయం కనబడుతున్నది. అదీగాక ఎప్పుడూ కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా పనిజేసే హరిశ్చంద్రారెడ్డి గారు కాకుండా జిల్లా కాంగ్రెస్ నాయకులే సమావేశాన్ని ఏర్పాటుచేసి అభ్యర్థిని నిర్ణయించి వుంటే బాగుండేదని ఒకరు వెలిబుచ్చారు. కానీ తాలుకాలో, పుచ్చలపల్లి వెంకారెడ్డి గారు తప్పితే, దశరధరామిరెడ్డి గారే తగిన అభ్యర్థి అనే ఏకగ్రీవాభిప్రాయం కూడా కావలి కాంగ్రెస్ వాదులలో కనుపిస్తుంది.

వెంకారెడ్డి గారు అభ్యర్థిగా వుండరనేది తేలిపోయింది. వారు కానప్పుడు అందరికీ అంగీకారమైన అభ్యర్థి కావలి వారిలో కనుపడదు. కాంగ్రెస్ వాదులలో యిక్కడున్నంత అనైక్యత, జిల్లాలో మరెక్కడా లేదేమోననిపిస్తుంది. అందువల్ల వెంకారెడ్డి గారు కానప్పుడు, దశరధరామిరెడ్డి గారు తప్ప కావలి వారికి మార్గాంతరం లేదు. స్థానిక కాంగ్రెస్ వాది అభ్యర్థిగా వుండడం కంటే దశరధరామిరెడ్డి గారు అభ్యర్థిగా వున్నందువల్ల కాంగ్రెసేతరుల బలం ఎక్కువగా పొందుటకు అవకాశముంటుంది. అదీగాక అర్హతల విషయంలో తాలుకా అభివృద్ధి దృష్టితో చూచినా స్థానికులకంటే, దశరధరామిరెడ్డి గారు అన్నివిధాల తగిన అభ్యర్థిగా వుంటారు.

# నెల్లూరు ముచ్చట్లు

## వివేకా వేషాలు

ప్రజాపథం కార్యక్రమాన్ని పురస్కరించుకొని నెల్లూరు నగరంలో జరిగిన డివిజన్ సభల్లో రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి తన సహజ ధోరణిలో పలు వేషాలువేసి జనాన్ని అలరించాడు. నాల్గవ డివిజన్ పరిధిలోనికి వచ్చే వేణుగోపాల్‌నగర్‌లో జనం బహూకరించిన పట్టువస్త్రాన్ని తలకు చుట్టుకొని చిందేసినంత పని చేశాడు. మరో డివిజన్‌లో ఎప్పటి మాదిరి ఓ వయస్సు మళ్లిన మహిళను ఆలింగనం చేసుకొన్నారు. ఓ చోట ఇస్త్రీ బండి దగ్గర పెట్టెతీసుకొని బట్టలను ఇస్త్రీ చేశాడు. కాసేపు గొర్రెపిల్లలను ఎత్తుకోవడం, ఇంకాసేపు తాపీమేస్త్రీగా వ్యవహరించడం చేశారు. మరోచోట టిఫిన్ బండి దగ్గర నిలబడి పులిబొంగరాలు, దోశెలు తిని అదేదో మోటు సామెతను గుర్తుకు తెచ్చారు.



## వివేకా ఆగడాలు మితిమీరాయి!

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ప్రజా సమస్యలు పరిష్కరించడం మాని పిచ్చి పిచ్చి పనులు చేస్తూ తిరుగుతున్నాడని జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి విమర్శించారు. వెంగళరావునగర్‌లో తెలుగుదేశం పార్టీ సభ్యత్వ కార్యక్రమాన్ని ప్రారంభించి మాట్లాడుతూ వివేకానందరెడ్డి మహిళలను వేధించడమే ధ్యేయంగా పెట్టుకొన్నాడు. ఒకప్పుడు కేంద్ర, రాష్ట్ర మంత్రులు పనబాకలక్ష్మి, నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మను ఏడిపించుకతిన్నాడు. మునిసిపల్ ఛైర్మన్‌గా పనిచేసిన తాళ్లపాక అనురాధ, మేయర్‌గా పనిచేసిన పులిమి శైలజలకు మానసిక క్షోభ కల్గించాడు. గతవారం బివిఎస్ బాలికల పాఠశాలలో 15ఏళ్ల బాలిక సిగలోని పూలవాసన చూడడం వివేకానందరెడ్డి ఆగడాలకు పరాకాష్ట అన్నారు. మేయర్ భానుశ్రీ కళ్లలో ఆనందం చూడను వివేకానందరెడ్డి ఎంత అకృత్యానికైనా పాల్పడుతున్నాడని దులపరించి పారేశాడు సోమిరెడ్డి.

## ఆరోగ్యశ్రీకి 77 కోట్లు!

జిల్లావ్యాప్తంగా ఇంతవరకు ఆరోగ్యశ్రీ పథకానికి 77 కోట్లు వెచ్చించినట్లు జిల్లా కలెక్టర్ రాంగోపాల్ చెప్పారు. 28వేల మంది శస్త్రచికిత్సలకు ఈ మొత్తం వెచ్చించినట్లు నెల్లూరు నగరంలో జరిగిన ప్రజాపథం సభలో వెల్లడించారు.

## జిల్లా బంద్ 27న!

నిత్యావసర వస్తువుల ధరల నియంత్రణలో విఫలమైన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ధోరణిని నిరసిస్తూ ఈ నెల 27వ తేదిన జిల్లా బంద్ నిర్వహిస్తున్నట్లు టిడిపి, వామపక్షాలు ప్రకటించాయి. 19వ తేది నెల్లూరు తెలుగుదేశం పార్టీ ఆఫీసులో సమావేశమైన మూడు పార్టీల నాయకులు ధరల పెరుగుదలపై జనాన్ని చైతన్యపరుస్తూ 24వ తేది సైకిల్ ర్యాలీ కూడా నిర్వహించాలని తీర్మానించారు. సమావేశంలో తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, సిపిఎం నేత మోహన్‌రావు, సిపిఐ నేత పముజుల దశరధరామయ్య పాల్గొన్నారు.

## ఫోర్త్‌టౌన్ ఎస్‌ఐకు పదోన్నతి

నెల్లూరు ఫోర్త్‌టౌన్ ఎస్‌ఐ వేమారెడ్డికి సిఐగా పదోన్నతి లభించింది. ప్రస్తుతం రేంజ్ క్రైం ఎస్‌ఐగా వున్న ఐ.శ్రీనివాసన్, ట్రాఫిక్‌లో వున్న సత్యనారాయణ, సూళ్లూరుపేట ఎస్‌ఐ శ్రీనివాసరావు, వాకాడు ఎస్‌ఐ కిషోర్‌బాబులు కూడా సిఐలుగా పదోన్నతులు పొందారు.

## ఎనిమిది వేలకు కొనాలి!

జిలకర మసూరి రకం ధాన్యాన్ని పుట్టి ఎనిమిది వేల రూపాయల చొప్పున రైతుల వద్ద నుంచి మిల్లర్లు కొనుగోలు చేయాలని జాయింట్ కలెక్టర్ సౌరబ్ గౌర్ ఆదేశాలు జారీ చేశారు. లేకుంటే చట్టపరమైన చర్యలు తప్పవన్నారు. ఈ విషయమై రైతులకు ఏమైనా సందేహాలుంటే జిల్లా పౌరసరఫరాల శాఖాధికారిని 99488 99484, 2331262 ఫోను నెంబర్లలో సంప్రదించవచ్చున్నారు. ఈ ఆదేశాన్ని నెల్లూరు రైసుమిల్లర్లు పాటిస్తారో లేదో వచ్చే వారం సమీక్షించుకొందాం.

## మెగా నేత్ర వైద్య శిబిరం

మెగా ఉచిత నేత్ర వైద్య శిబిరం మనుబోలు మండలం వీరంపల్లి గ్రామంలో 19తేది జరిగింది. వదాన్యుడు బద్దెవోలు శ్రీహరిరెడ్డి తన తల్లితండ్రులు మస్తాన్‌రెడ్డి, రుక్మిణమ్మల జ్ఞాపకార్థం ఏర్పాటుచేసిన నేత్ర వైద్య శిబిరాన్ని ఎస్పీ దామోదర్ ప్రారంభించారు. షుమారు 500 మందికిపైగా రోగులకు కంటి పరీక్షలు నిర్వహించి ఉచితంగా మందులను పంపిణీ చేశారు. ఈ వైద్య శిబిరంలో వైద్యులు కృష్ణమూర్తి, పిఎల్.రావు, వెంకటేష్ తదితరులు పాల్గొన్నారు.

కొరవ 14వ పేజీలో

# కూరగాయల మార్కెట్‌ను దారికి తేలేరా?


మార్కెట్‌లో పరిస్థితులు మారేదెప్పుడు?

జిల్లా కలెక్టర్, జాయింట్ కలెక్టర్, తూనికలు కొలతల శాఖాధికారులు, మార్కెటింగ్ శాఖాధికారులు అందరూ ఏకమై నెల్లూరు ఎసి సుబ్బారెడ్డి కూరగాయల మార్కెట్‌లోని పరిస్థితులను మార్చాలని ప్రయత్నిస్తున్నా వ్యాపారులు మాత్రం కొరకరాని కొయ్యలుగానే వున్నారు. కూరగాయల మార్కెట్‌లో అనాదిగా సిపిఎం పార్టీ బలంగా వుండేది. మార్కెట్ నాగేశ్వరరావు చెప్పిందే వేదంగా మార్కెట్‌లోని వ్యాపారులు నడిచేవారు. ఆయన్ను సిపిఎం పార్టీ బహిష్కరించినా, స్వంతంగా షాపులో కూర్చొని నాగేశ్వరరావు కూరగాయల వ్యాపారం చేయకపోయినా మార్కెట్‌లో ఆయన బిర్రు తగ్గలేదు. మార్కెట్‌లో వ్యాపారం చేసుకొనే వ్యాపారస్తులు 60 లక్షలకు పైగా అద్దె బకాయిలున్నారు. ఈ బకాయిలను వసూలు చేసే దమ్ము మార్కెటింగ్ శాఖాధికారులకు లేదు.

ఇక్కడ కేటాయించిన షాపులు ఒకరి పేర వ్యాపారాలు మరొకరు చేసుకొంటున్నారు. కూరగాయలే అమ్మాల్సి వున్నా కిరాణా కొట్లు, ఇతర వ్యాపారాలు ఈ మార్కెట్‌లో జరుగుతున్నాయి. 400పైగా చిన్న, పెద్ద అంగళ్లున్నా మార్కెట్‌లో కనీసం పది షాపుల్లో కూడా కూరగాయల తూకం సరిగ్గా వుండదు. నాణ్యమైన కూరగాయలను వినియోగదారులు ఏరుకొనే అవకాశమే లేదు. వాళ్లు చెప్పిందే రేటు. ప్రశ్నిస్తే తిట్లు, మూకుమ్మడిగా లేచి వచ్చి కొడతారు. మహిళలు, యువతులను 'కిండల్'గా మాట్లడే వ్యాపారుల బ్యాచ్ కూడా ఇక్కడుంది. ప్రజలు, వినియోగదారుల ఫిర్యాదుల

## కొరకరాని కొయ్యలుగా మారిన వ్యాపారులు

మేరకు జాయింట్ కలెక్టర్ సౌరబ్‌గౌర్ ఇక్కడ ఎలక్ట్రానిక్ తక్కెడలు పెట్టాలన్న ప్రతిపాదనను జనవరి నెలలో తెచ్చారు. ఏప్రెల్ నెల ముగుస్తున్నా అది కార్యరూపం దాల్చలేదు. కొన్ని షాపుల్లో ఎలక్ట్రానిక్ తక్కెడలు వున్నా అవి చూపుడుకే. పాత తక్కెడలతోనే వ్యాపారం చేస్తున్నారు. అర కిలో, పావు కిలో కూరగాయలు ఇవ్వరు. టమోటాలైతే రెండున్నర కిలో కొనాలి. మార్కెట్‌లో పరిస్థితులపై జిల్లా కలెక్టర్ సైతం గడచిన వారంలో తన ఛాంబర్‌లో సమీక్ష జరిపారు. పరిస్థితులను అదుపులోకి తెమ్మని అధికారులను ఆదేశించారు. చూడాలి ఈసారైనా పరిస్థితుల్లో మార్పు వస్తుందో? రాదో? అయినా మనలో మాట... అధికారులు గట్టిగా కన్నెర్రచేస్తే మార్కెట్‌లోని వ్యాపారులు ఎంత?

# దడబడలు సృష్టించిన సురేష్‌రెడ్డి


నగర వీధుల్లో బిజెపి అధికార ప్రతినిధి సురేష్‌రెడ్డి ఊరేగింపు.

నెల్లూరు బిజెపి నేతల్లో సన్నపురెడ్డి సురేష్‌రెడ్డి శైలేవేరు. ఇటీవల వరకు రాజకీయాన్ని రెండో అంశంగా పరిగణిస్తూ వ్యాపారాల్లో బిజీగా వుండిన ఆయనను పార్టీ రాష్ట్ర అధికార ప్రతినిధిగా నియమించింది. అందివచ్చిన అవకాశాన్ని తనకు అనుకూలంగా మలచుకొనే సురేష్‌రెడ్డి పాత అనుచరగణాన్ని మొత్తాన్ని మోహరింపజేసి 17వ తేది నగరంలో జరిపిన ప్రదర్శన ఆకట్టుకొంది. పదవి చిన్నదే అయినా నెల్లూరులో బిజెపి ప్రాభవం పూర్తిగా కోల్పోలేదనే సందేశం ప్రజలకు వెళ్లేలా ఈ ప్రదర్శన కొనసాగింది. పార్టీ యువజన విభాగం కార్యకర్తలు బిజెపి పతాకాలు చేబూని స్కూటర్లపై ప్రదర్శనగా ముందుకు సాగుతుండగా వారిని వీరపాండ్యకట్ట బ్రహ్మన, శివాజి పాత్రధారులు గుర్రాలపై ఎక్కి అనుసరించారు. కొంత మంది మహిళా కార్యకర్తలు, వారిలోనూ కొందరు ముస్లిం మహిళలు వుండేట్లు జాగ్రత్తలు తీసుకొన్నాడు. బాణసంచా మోత, కీలుగుర్రాలు, తప్పెట్ల బృందాల చివరన ఓపెన్ టాప్ జీపులో సురేష్‌రెడ్డి చంద్రబాబునాయుడిలా విజయచిహ్నంగా రెండేళ్లను చూపుతూ ట్రంకురోడ్డంతా తిరిగారు. బహిరంగసభ గట్రాపెడితే జనం వెలితి కనపడుతుందని మినీబైపాస్ రోడ్డులోని పార్టీ ఆఫీసులోనే తన అభినందన తతంగాన్ని ముగించి తెలివైన రాజకీయవేత్తనని నిరూపించుకొన్నాడాయన. పదవిలేదని ఇన్నాళ్లు మూగ మొద్దులా వున్న సురేష్‌రెడ్డికి పార్టీ మాట్లాడే పదవి ఇచ్చింది కాబట్టి ఆయనెలా పనిచేస్తారో కొన్నాళ్లు వేచిచూస్తే తెలిసిపోతుంది.

# సూచనలు సలహాలకే పరిమితం

## ప్రజాపథం తీరిది!


తన ఇంట్లో ప్రజాపథం కార్యక్రమంపై సమీక్ష జరుపుతున్న మంత్రి ఆనం రామనారాయణరెడ్డి.

ప్రజాపథం కార్యక్రమంలో ప్రభుత్వం ప్రధానంగా ఏడు అంశాలపై శ్రద్ధ వహిస్తున్నట్లు మునిసిపల్ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి చెప్పారు. 18వ తేది ఇందిరా భవన్‌లో విలేకరులతో మాట్లాడారు. త్రాగునీటి సమస్య, ఉపాధి హామీ పథకం అమలు, రైతులకు ఉచిత విద్యుత్, వీధిలైట్లు, ఆరోగ్యం, 108, 104 వాహనాలను ప్రజలకు చేరువ చేసేందుకు ప్రజల నుంచి సూచనలు సలహాలను తీసుకుంటామన్నారు. గ్రామసభల్లో, వార్డుసభల్లో వచ్చే అదనపు అంశాలైన రేషన్‌కార్డులు, ఇళ్లస్థలాలు, పావలా వడ్డీకి రుణాలు వంటి అంశాలను అధికారులు స్పష్టంగా నమోదుచేసి సాయంత్రానికి జిల్లా కలెక్టర్‌కు నివేదిక పంపుతారన్నారు. ప్రతి సమస్యను పరిష్కరించేందుకు ప్రభుత్వం శ్రద్ధ చూపుతుందన్నారు. ప్రజాపథం కార్యక్రమానికి నిధుల కొరత లేదన్నారు. త్రాగునీటి సమస్య పరిష్కారానికి కరవు గ్రాంటు క్రింద నాలుగు కోట్ల రూపాయలను విడుదల చేశామన్నారు. అంతేకాకుండా దీర్ఘకాలంగా వున్న త్రాగునీటి సమస్యలను పరిష్కరించే దిశలో మరో 44 కోట్ల రూపాయలను ముఖ్యమంత్రి రోశయ్య విడుదల చేసినట్లు చెప్పుకొచ్చారు. ప్రజాపథంలో వచ్చిన ప్రజల అర్జీలు సాయంత్రం లోపల జిల్లా కలెక్టర్‌కు అక్కడ నుంచి ప్రభుత్వానికి చేరుతాయన్నారు. ప్రజాపథాన్ని విజయవంతం చేసేందుకు స్థానిక ఎమ్మెల్యేలు, అధికార పదవుల్లో వున్న ప్రజాప్రతినిధులు బాధ్యతలు తీసుకోవాలన్నారు. ఈ సమావేశంలో డిసిసి అధ్యక్షుడు ఎల్లసిరి గోపాలరెడ్డి, నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, శాసనమండలి సభ్యుడు బూదాటి రాధయ్య తదితరులు పాల్గొన్నారు.

# పెరుగుతున్న హెచ్‌ఐవి బాధితులు

## పిల్లల సంఖ్య ఎక్కువగా వుండడం బాధాకరం

ఎయిడ్స్ మహమ్మారి చాప క్రింద నీరులా పలువురిని పొట్టన పెట్టుకొంటున్న సంగతి తెలిసిందే. జిల్లావ్యాప్తంగా వేల మంది హెచ్‌ఐవి, ఎయిడ్స్ బారిన పడినట్లు గణాంకాలు చెప్తున్నాయి. వ్యాధిసోకిన వారిలో అభం శుభం తెలియని చిన్నారులుండడం గుండెను పిండే విషయం. నెల్లూరు పెద్దాసుపత్రిలోని యాంటీ రిట్రో వైరల్ థెరపీ(ఎఆర్‌టి) సెంటర్‌లో హెచ్‌ఐవి, ఎయిడ్స్ వ్యాధిగ్రస్తులు 5,800 మంది చికిత్స పొందుతున్నారు. వీరిలో 300 మంది చిన్నారులు వుండటం ఎంతగా ఎయిడ్స్ మహమ్మారి పసిపిల్లలను కబళిస్తున్నది అర్థం చేసుకోవచ్చు. తల్లితండ్రుల్లో ఎవరో ఒకరు తెలిసో తెలియకో చేసిన పాపానికి చిన్నారులు బలైపోతుండడంతో చూసే వారికి కన్నీళ్లు తెప్పిస్తోంది.

జిల్లావ్యాప్తంగా పలు ప్రాంతాలలో ఎయిడ్స్, హెచ్‌ఐవి బారినపడిన పసిపిల్లలు అధికసంఖ్యలోనే వున్నట్లు సమాచారం. నిండు నూరేళ్లు జీవించాల్సిన పిల్లలు చిక్కి శల్యమై మరణానికి దగ్గరవుతూ అటు చావలేక, ఇటు బ్రతకలేక నరకం అనుభవిస్తున్నారు. ఎయిడ్స్ వ్యాధిపై అవగాహన కల్పించి ప్రజలను చైతన్యవంతం చేయాల్సిన స్వచ్ఛంద సంస్థలు నిధులు తెచ్చుకొనేందుకే పరిమితమవుతూ తమ విధులను విస్మరిస్తుండడం వల్ల ఈ వ్యాధిగ్రస్తుల సంఖ్య రోజురోజుకూ పెరిగి పోతుంది. జిల్లా అధికారులు బలైపోతున్న పసివారిని చూసైనా స్పందించి చైతన్య కార్యక్రమాలు సక్రమంగా జరిగేలా చూడాల్సి వుంది.

# కాసుల వేటలో కళాసంస్థలు

## డబ్బిస్తే సన్మానాలు

సమాజాన్ని చైతన్య పరచేది కళ. తమ కోసం కాకుండా ప్రజలను చైతన్యం చేసేందుకు కళాకారులు పాకులాడుతుంటారు. ఎందరో కళాకారులు తమ జీవితాలను కళారంగానికి అంకితం చేశారు. ఎన్నో సంస్థలు కళాకారులను ప్రోత్సహించేందుకు, కళారంగాన్ని బ్రతికించేందుకు కృషి చేశాయి. ఇదంతా గతం. నేడు కళాసంస్థల పేరుతో కాసులవేటలో పడ్డారు నిర్వాహకులు. వ్యక్తుల కోసం, వారి ప్రాపకం కోసం ప్రాకులాడుతూ కళారంగాన్ని భ్రష్టుపట్టిస్తున్నారు.

ప్రతిభ గల కళాకారులకు వెన్నుదన్నుగా నిలచి వారిని ప్రోత్సహించాల్సిన కళాసంస్థలు దానిని విస్మరించి ఓనమాలు కూడా తెలియని వారిని ఆహా... ఓహో అంటూ కీర్తిస్తూ తమ పబ్బం గడుపుకుంటున్నాయి. సరిగా నడకేరాని వారికి నాట్యమయూరి అని, నాట్యమంజరి అని, సంగీతంలో గమకాలు పాడలేని వారిని గానకోకిలలని తమకు తోచిన బిరుదులు ప్రదానం చేస్తూ చంకలు గుద్దుకుంటున్నారు. పబ్లిసిటీ పిచ్చిగల కొందరు వీరికి ప్రధాన ఆదాయ వనరుగా మారారు. ఏదో ఒక నెపంతో కార్యక్రమాలు నిర్వహించి తమ వారికి, ఖర్చుపెట్టుకోగల వారికి ఇలా బిరుదులు అందిస్తూ, దాంతోపాటు తమకు ఆర్థిక సహాయం అందించే వారికి నిలువెత్తు ఫోటోలు పెట్టి కార్యక్రమం జరపడం ఇటీవల కాలంలో నగరంలో ఒక రివాజైంది.

ప్రజల ఆదరణ పొందిన వారు, వివిధ రంగాల్లో తమ ప్రతిభాపాటవాలను ప్రదర్శించిన వారిని కాకుండా పొగడ్తలతో ముంచెత్తిన వారికి, మైకు పట్టుకొంటే ఊకదంపుడు ఉపన్యాసం ఇచ్చేవారికి ప్రాధాన్యమిస్తూ వారి పేరు చివర సామ్రాట్‌లనే తోకలు తగిలించి వారిని వారే పొగుడుకుంటుండడం కళాహృదయాలను, కళలను ఇష్టపడేవారి మనసును రంపపు కోతకు గురిచేస్తున్నది. తమ ఆదాయం కోసం కళాసంస్థలు స్థాపించడం కాకుండా నిజమైన కళాకారులు, జీవితాన్ని కళలకు అంకితం చేసినవారిని ప్రోత్సహించి ఆదరించినపుడే కళలు, కళాసంస్థలకు గౌరవం లభిస్తుంది.

# భూ పంపిణీపై సందిగ్ధం!

**చివరిక్షణంలో ముఖ్యమంత్రి పర్యటన రద్దు కావడంతో జిల్లాలో భూపంపిణీ కార్యక్రమం నిలిచిపోయింది. జిల్లాలోని 46 మండలాలకు గాను 15 మండలాల్లో భూముల పంపిణీ వ్యవహారమై తకరాదులు తలెత్తాయి.**




భూ పంపిణీపై సరైన నిర్ణయం తీసుకోలేని జిల్లా కలెక్టర్ కార్యాలయం.

జిల్లాలో భూ పంపిణీపై సందిగ్ధం నెలకొనింది. ఏప్రిల్ 14వ తేది అంబేద్కర్ జయంతి రోజున ముఖ్యమంత్రి చేతులమీదుగా భూ పంపిణీ కార్యక్రమాన్ని ప్రారంభించాల్సి వుండగా అనివార్య కారణాల వల్ల సిఎం పర్యటన వాయిదా పడడంతో ఈ కార్యక్రమం ప్రారంభానికి నోచుకోలేకపోయింది. ముఖ్యమంత్రి పర్యటన రద్దు కావడంతో భూ పంపిణీ కార్యక్రమం మే2వ తేదిన తిరిగి ప్రారంభిస్తామని జిల్లా అధికారులు ప్రకటించారు. రాష్ట్ర అసెంబ్లీ సమావేశాలు ముగిసిన వెంటనే జిల్లాలోని ఎనిమిది అసెంబ్లీ నియోజకవర్గాలలో భూపంపిణీ కార్యక్రమం చేపట్టేందుకు అసైన్‌మెంటు కమిటీ సమావేశాలకు శ్రీకారం చుట్టారు.

స్థానిక ఎమ్మెల్యేల అధ్యక్షతన జరిగిన సమావేశాలలో లబ్దిదారుల ఎంపిక, ప్రభుత్వ భూముల సేకరణ తదితర అంశాలపై చర్చలు జరిగాయి. కావలి, గూడూరు, నెల్లూరు రెవిన్యూ డివిజన్ కార్యాలయాలలో నిర్వహించిన అసైన్‌మెంటు కమిటీ సమావేశాల్లో అధికార, ప్రతిపక్ష పార్టీలకు చెందిన పలువురు అభ్యంతరాలు వ్యక్తం చేయడంతో కొన్ని మండలాల్లో లబ్దిదారుల ఎంపిక నిలిచిపోయింది. జిల్లాలో పది అసెంబ్లీ నియోజకవర్గాలుండగా వీటిలో ఎనిమిది నియోజకవర్గాల్లోని 31 మండలాల్లో భూ పంపిణీ చేయాలని జిల్లా అధికార యంత్రాంగం ముందుగా నిర్ణయించింది.

## మార్పుచేర్పుల్లో అధికార యంత్రాంగం!

లబ్దిదారుల ఎంపిక సక్రమంగా జరగక పోవడం, ముఖ్యమంత్రి పర్యటన వాయిదా పడడం వంటి కారణాలతో అధికార యంత్రాంగం లబ్దిదారుల జాబితాను సవరించడం, చేర్పులు, మార్పులు చేసే పనిలో నిమగ్నమై వుంది. రాష్ట్రంలో 2004 సంవత్సరంలో కాంగ్రెస్ ప్రభుత్వం అధికారం చేపట్టిన తర్వాత భూ పంపిణీ కార్యక్రమాన్ని చేపట్టడం జరిగింది. ఇప్పటివరకు నాలుగు విడతలుగా చేపట్టిన భూ పంపిణీ కార్యక్రమం ద్వారా ఆశించిన ఫలితాలు అందకుండాపోయాయి.

తొలి విడత నిర్వహించిన ఈ కార్యక్రమంలో 1975 సంవత్సరంలో పంపిణీ చేసిన భూములు అన్యాక్రాంతం అయిన వాటిని తిరిగి స్వాధీనం చేసుకుని లబ్దిదారులకు పంచి పెట్టారు. పేదలకు పంపిణీ చేసిన భూములన్నీ కూడా భూస్వాములు, రియల్‌ఎస్టేట్ వ్యాపారుల చేతుల్లోకి వెళ్లాయి. వీటిని స్వాధీనం చేసుకునేందుకు రెవిన్యూ యంత్రాంగం రాజకీయ ఒత్తిళ్లకు తలొగ్గకుండా ఎంతో శ్రమించి భూముల్ని స్వాధీనం చేసుకోవడం జరిగింది. స్వాధీనం చేసుకొన్న వాటిలో అసైన్‌మెంటు, సిజెఎఫ్‌ఎస్, ప్రభుత్వ పోరంబోకు భూములధికంగా వున్నాయి.

## రాజకీయనేతల రంగప్రవేశం

రెండవ విడత భూ పంపిణీ చేపట్టే సమయంలో కొందరు ఉన్నతాధికారులు బదలీ కావడంతో రాజకీయ నేతలు రంగప్రవేశం చేసి భూస్వాముల ఆధీనంలో వున్న భూముల జోలికి వెళ్ళకుండా చేయడంలో సఫలీకృతులయ్యారు. దీంతో ఈ కార్యక్రమం నామమాత్రంగా కొనసాగింది. జిల్లాలో నాలుగు విడతలుగా పంపిణీ చేసిన భూములను లబ్దిదారులకు ఇప్పటివరకు అధికారులు చూపించలేదంటే ఆశ్చర్యపోక తప్పదు. గూడూరు డివిజన్‌లో దివంగత ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి చేతుల మీదుగా పట్టాలు అందించారు అధికారులు. ఈ భూములకు సంబంధించిన రికార్డులను తయారు చేయడంలో కూడా కొందరు రెవిన్యూ అధికారులు చాలా నిర్లక్ష్యంగా వ్యవహరించిన విషయం బహిర్గతమయ్యింది. సాక్షాత్తు ముఖ్యమంత్రి చేతుల మీదుగా పట్టాలు అందించిన అధికారులు భూముల అప్పగించే విషయంలో చాలా బాధ్యతారాహిత్యంగా వ్యవహరించారు. జిల్లా కలెక్టరేట్‌లో ప్రతి సోమవారం నిర్వహించే "గ్రీవెన్స్ డే"లో భూముల హద్దులు చూపించమని, పాస్‌బుక్‌లు సక్రమంగా లేవంటూ లబ్దిదారులు వినతి పత్రాలు అందజేస్తూనే వున్నారు. ప్రస్తుతం అయిదవ విడత భూ పంపిణీకి మహిళల పేరుమీద పాస్‌బుక్‌లు అందజేయాలని ప్రభుత్వం ప్రకటించినప్పటికి దీనికనుగుణంగా అధికారులు వ్యవహరించడం లేదు.

## తేలని లెక్కలు!

అయిదవ విడత ప్రారంభించే భూపంపిణీ కార్యక్రమానికి ఇప్పటివరకు కూడా ఎన్ని ఎకరాలు, ఎంతమంది లబ్దిదారులకు పంపిణీ చేస్తారన్న విషయాన్ని జిల్లా రెవిన్యూ అధికారులు స్పష్టంగా ప్రకటించలేకపోతున్నారు. మునిసిపల్ శాఖ మంత్రిగా వున్న ఆనం రామనారాయణరెడ్డి ప్రాతినిధ్యం వహిస్తున్న ఆత్మకూరు నియోజకవర్గంలో అసైన్‌మెంట్ కమిటీ సమావేశం ఇంతవరకు జరగలేదు. ఈ నియోజకవర్గంలో భూపంపిణీ కార్యక్రమం చేపట్టాల్సివుండగా మంత్రి సమావేశం జరిపించకపోవడంతో అధికారులు ఏం చేయాలో దిక్కుతోచని స్థితిలో వున్నారు. కావలి నియోజకవర్గానికి సంబంధించి నిర్వహించిన అసైమెంట్ కమిటీ సమావేశంలో లబ్దిదారుల ఎంపిక విషయంలో గందరగోళ పరిస్థితులు నెలకొనడంతో సమావేశం వాయిదా వేయాల్సి వచ్చింది. ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు ప్రతిపక్షంలో వుండడంతో అధికార పార్టీకి చెందిన నేతలు పలు అభ్యంతరాలు చెప్పారు. ఈ నియోజకవర్గంలో దగదర్తి, జలదంకి మండలాలకు సంబంధించి లబ్దిదారుల ఎంపికలో అధికార, ప్రతిపక్ష పార్టీలకు చెందిన నేతలు ఒకరిపై మరొకరు ఆరోపణలకు దిగడంతో సమావేశాన్ని అధికారులు వాయిదా వేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. మరో ప్రక్క జిల్లా కలెక్టర్ యుద్ధ ప్రాతిపదికన 31 మండలాల్లో లబ్దిదారుల జాబితాలను సిద్ధం చేయాలని మండల తహశీల్దార్‌లను పదే పదే సెట్ కాన్ఫరెన్స్ ద్వారా కోరుతున్నా ఎమ్మెల్యేల సహకారం లేకపోవడంతో సమాధానం చెప్పలేక తలలు పట్టుకుంటున్నారు. ఈ నెల 30వ తేదిన రాష్ట్ర ముఖ్యమంత్రి రోశయ్య జిల్లా పర్యటనకు వస్తారని ప్రచారం కూడా జరిగినప్పటికి మే 2వతేదికి సిఎం పర్యటన వాయిదా పడినట్లు తెలుస్తుంది.

## రెండు దఫాల వాయిదా

రాష్ట్ర ముఖ్యమంత్రి కె.రోశయ్య జిల్లా పర్యటన ఇప్పటికే రెండు దఫాలు వాయిదా పడింది. తొలుత ఏప్రిల్ 14న పర్యటన ఖరారయ్యి 30వ తేదికి వాయిదా పడింది. అయితే అదే రోజు సిఎం ఢిల్లీ పర్యటనలో వుండే అవకాశం వుండడంతో మే 2వ తేదీకి ముచ్చటగా మూడవ దఫా వాయిదా పడింది. ఈ నేపథ్యంలో రెండు దఫాలుగా వాయిదాపడి నిలిచిపోయిన భూ పంపిణీ కార్యక్రమాన్ని మే 2వ తేది సిఎం ప్రారంభిస్తారని అధికారవర్గాలు అంటున్నాయి. ఇదిలా వుండగా అయిదవ విడత చేపట్టే ఈ కార్యక్రమంలో అనర్హులను ఎంపిక చేస్తున్నారన్న ఆరోపణలు కూడా బలంగా వినిపిస్తున్నాయి. అధికార, ప్రతిపక్ష పార్టీలకు చెందిన నేతలు సూచించిన వారిని ఎంపిక చేయాల్సి వస్తుందని పేరు వెల్లడించను ఇష్టపడని కొందరు తహశీల్దార్‌లు వ్యాఖ్యానించారు. అధికార, ప్రతిపక్ష పార్టీల నేతల మధ్య తాము ఇబ్బంది పడక తప్పడం లేదని వాపోయారు. ప్రభుత్వం రూపొందించిన మార్గదర్శకాల ప్రకారం ఎక్కడా కూడా ఎంపికలు జరగడం లేదు.

మరో ప్రక్క జిల్లాలో భూ పంపిణీ కార్యక్రమం చేపడతారా? లేదా? అన్న సందేహాలు వ్యక్తమవుతున్నాయి. ఎందుకంటే అసైన్‌మెంట్ కమిటీ సమావేశాలు ముందుగా నిర్ణయించిన అసెంబ్లీ నియోజకవర్గాలలో సక్రమంగా జరపకపోవడం, భూముల సేకరణ దగ్గర నుంచి లబ్దిదారుల ఎంపిక, రికార్డుల తయారీ వరకు అవకతవకలు చోటు చేసుకొంటున్నాయి. జిల్లా కలెక్టర్ స్పందించి భూ పంపిణీ కార్యక్రమం పట్ల ప్రజల్లో నెలకొని వున్న సందేహాలను నివృత్తి చేసేందుకు చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190
జీవిత చందా రూ.1000లు
**సంవత్సర చందా**
స్వదేశంలో రూ.200లు
విదేశాలకు రూ.1000లు



నెల్లూరు తెలుగుదేశంపార్టీ ఆఫీసులో సభ్యత్వ నమోదు కార్యక్రమంలో జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి. ప్రక్కన పార్టీ పరిశీలకులు బీద రవిచంద్ర, కరణం బలరాం, గోరంట్ల బుచ్చయ్య చౌదరి తదితరులు.



గోల్డన్ జూబ్లీ హాల్‌లో త్రాగునీటి కాల్ సెంటర్‌ను ప్రారంభిస్తున్న జడ్పీ ఛైర్మన్ గోవర్ధన్‌రెడ్డి. ప్రక్కన జిల్లా కలెక్టర్ రాంగోపాల్, డ్వామా పిడి రామిరెడ్డి.



నెల్లూరు చిల్డ్రన్స్ పార్కు వాకర్స్ వెల్ఫేర్ అసోసియేషన్ నేతృత్వంలో నవ్వుకుందాం రండి - జోకింగ్ క్లబ్ ప్రారంభోత్సవంలో డ్వామా పిడి రామిరెడ్డి, ప్రభాకర్‌రెడ్డి, పాముల రమణయ్య, మురళీమోహన్‌రావు.

# కోడూరు బీచ్ రోడ్డుకు మోక్షం!

## ఉపాధి హామీ పథకం నిధులతో పనులు

ఎట్టకేలకు కోడూరు బీచ్‌రోడ్డుకు మోక్షం లభించింది. ఉపాధి హామీ పథకం ద్వారా నిధులు విడుదల కావడంతో బీచ్‌రోడ్డు మరమ్మత్తు పనులు చురుగ్గా సాగుతున్నాయి. జిల్లాలో పర్యాటక కేంద్రంగా వెలుగొందుతున్న కోడూరు బీచ్‌కు వెళ్లే రోడ్డు ఇటీవలకాలంలో గుంటలమయంగా మారింది. దీంతో బీచ్‌కు వచ్చే సందర్శకులు రోడ్డుపై ప్రయాణించాలంటేనే తీవ్ర ఇబ్బందులు పడే వారు. సందర్శకులు పడుతున్న అవస్థలు గమనించిన స్థానిక శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి బీచ్‌రోడ్డు మరమ్మత్తులకు ఉపాధి హామీ పథకం క్రింద 30 లక్షల రూపాయలు విడుదల చేయించారు. ఈ నిధులతో రోడ్డు నిర్మాణ పనులు చేపట్టారు. ఇక కోడూరు బీచ్‌కు వెళ్లేవారికి ప్రయాణం సాఫీగా జరుగుతుంది.

# కంచే చేను మేసింది!

## పొదలకూరులో విద్యుత్ తీగలమ్మిన సిబ్బంది

కంచే చేను మేసిన చందంగా వుంది పొదలకూరు ట్రాన్స్‌కో సిబ్బంది వ్యవహారం. లక్షల రూపాయల విలువ చేసే విద్యుత్ స్తంభాలు, వైర్లు తరలించడంలో చేతివాటం ప్రదర్శించిన తీరు బట్టబయలైంది. నెల్లూరు మార్గంలో రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసే వాళ్ల స్థలంలో అడ్డంగా వున్న విద్యుత్ స్తంభాలను తొలగించమని ట్రాన్స్‌కో అధికారులను కోరారు. స్థానికంగా వుండే ప్రైవేటు స్కూలు యాజమాన్యం కూడా పాఠశాల ప్రాంగణంలో అడ్డగోలుగా వున్న ఆరు ఇనుప స్తంభాలను తొలగించాల్సిందిగా కోరింది. దీంతో ట్రాన్స్‌కో అధికారులు అడ్డంగా వున్న వాటిని తొలగించమని సిబ్బందిని ఆదేశించారు. సిబ్బంది ఆ విద్యుత్ స్తంభాలను కార్యాలయానికి తరలించకుండా ప్రైవేట్ వర్క్ షాపుకు తరలించారు. టన్ను బరువుండే వైర్లను అమ్మేశారు. వచ్చిన డబ్బులో వాటాల పంపకాల విషయమై పేచీలు తలెత్తి విషయం కాస్త బట్టబయలైంది. లక్షల రూపాయల సొమ్ము దిగమింగిన ట్రాన్స్‌కో సిబ్బందిపై చర్యలు తీసుకోవాలని స్థానికులు కోరుతున్నారు.

• కండలేరు క్రీక్‌ను

# నమ్ముకొన్నవారికి కష్టాలు!

## వేట కష్టంగా వుంది

కండలేరు జలాశయం నుంచి వందల కిలోమీటర్లు ప్రయాణించి రైతాంగానికి సాగునీరు, మత్స్యకారులకు మత్స్య సంపదను అందించే కండలేరు క్రీక్ ప్రమాదస్థితికి చేరుకొంది. సహజ సిద్ధంగా ఏర్పడిన క్రీక్‌ను ఆధారంగా చేసుకొని వేలాది కుటుంబాలు సాగిస్తున్న జీవనం ప్రశ్నార్థకమైంది. రాపూరు సమీపంలో మొదలయ్యే కండలేరు క్రీక్ సైదాపురం, గూడూరు, మనుబోలు మండలాల మీదుగా చిల్లకూరు మండలంలో తిప్పగుంటపాళెం, తిక్కవరం, బెస్తపాళెం, చిన్నకట్టపల్లి, రామారెడ్డిపాళెం, పొన్నవోలు, ఏరూరు, మోమిడి, వరగలి, తిమ్మినపట్నం, గుమళ్లదిబ్బ గ్రామాల మీదుగా వెళ్లి మిద్దె రేవు వద్ద సముద్రంలో కలుస్తుంది. సముద్రంలో పోటు వచ్చినప్పుడు వచ్చే ఉప్పు నీరు తీర గ్రామాల్లో రొయ్యల గుంటలకు వినియోగిస్తారు. వరదలు సంభవించినపుడు గ్రామాలు ముంపుకు గురికాకుండా నీటిని ఈ క్రీక్ ద్వారానే మళ్లిస్తారు. ఇంతగా ఉపయోగపడే కండలేరు క్రీక్‌పై పలు ప్రయోగాలు చేయడం, పరికరాలను ఏర్పాటు చేయడంతో కండలేరు కుంచించుక పోవడంతోపాటు ముఖద్వారం దెబ్బ తింటున్నది.

# క్రికెట్ బోర్డు ప్రక్షాళన

## వెంకటగిరిలో ఆంధ్ర క్రికెట్ అసోసియేషన్ అధ్యక్షుడి వెల్లడి

రాష్ట్రం నుంచి జాతీయ క్రికెట్ జట్టుకు ఆటగాళ్లు ఎంపికయ్యేలా తగిన కృషి చేస్తున్నట్లు ఆంధ్ర క్రికెట్ అసోసియేషన్ అధ్యక్షుడు గోకరాజు గంగరాజు తెలిపారు. వెంకటగిరి విచ్చేసిన ఆయన పలు అంశాలపై మాట్లాడారు. భ్రష్టుపట్టిన ఆంధ్ర క్రికెట్ సంఘాన్ని సరిదిద్దేందుకు పదవి చేపట్టానన్నారు. ఏసిఏ అవకతవకల కారణంగా క్రీడాకారుల ఎంపిక సక్రమంగా జరగలేదన్నారు. చాముండేశ్వరినాథ్ హయాంలో పలు అక్రమాలు జరిగాయని ఆరోపించారు. నెల్లూరులో 22 ఎకరాల్లో క్రికెట్ స్టేడియాన్ని నిర్మించేందుకు చర్యలు చేపడుతున్నట్లు వివరించారు. తిరుపతిలో రెండు స్టేడియంలను తుడా ఏసిఏకు అప్పగించిందని, వీటిని అంతర్జాతీయ ప్రమాణాలతో నిర్మిస్తున్నట్లు తెలిపారు. గూడూరులోనూ మినీ స్టేడియం నిర్మించాలన్న ఆలోచనలో వున్నామన్నారు. క్రీడాకారుల్లో దాగివున్న ప్రతిభను వెలికితీసి వారిని జాతీయ జట్టులో ప్రవేశించేలా తగిన కృషి చేస్తున్నామని, దీనిలో భాగంగా జోన్‌లకు ఆడిన క్రీడాకారులకు నెలకు 3వేల రూపాయలు చెల్లిస్తున్నామన్నారు. అనంతరం స్థానికంగా వుండే తారక రామ క్రీడా ప్రాంగణాన్ని పరిశీలించారు. వెంకటగిరి రాజాలు ప్రాంగణం అభివృద్ధికి చేస్తున్న కృషిని ప్రశంసించిన గంగరాజు ఏసిఏ కూడా 4లక్షల రూపాయలు దీని అభివృద్ధికి అందజేస్తుందన్నారు. ఆయనతోపాటు మాజీ వికెట్ కీపర్ ఎంఎస్‌కె.ప్రసాద్, అంధ్ర క్రికెట్ అసోసియేషన్ ఉపాధ్యక్షుడు రాంప్రసాద్ యాచేంద్ర, అంతర్జాతీయ అంపైర్ ప్రతాప్ తదితరులు పాల్గొన్నారు.

# విద్యుత్ చౌర్యాన్ని అరికట్టాలి!

విద్యుత్ చౌర్యం జరుగుతున్నదంటే అందుకు సిబ్బంది అలసత్వమే కారణమని డిస్కం సిఎండి గోపాలరెడ్డి వ్యాఖ్యానించారు. ఇందుకూరుపేట మండలానికి వచ్చిన ఆయన ఈ ప్రాంతంలోని పలు సబ్‌స్టేషన్ల పనితీరును పరిశీలించారు. లేబూరు సబ్‌స్టేషన్‌లో గంటకుపైగా గడిపిన గోపాలరెడ్డి సిబ్బందితో విద్యుత్ సరఫరా, వాడకం, బిల్లుల చెల్లింపులపై చర్చించారు. విద్యుత్ ఒక్క యూనిట్ చౌర్యం జరిగినా సహించేదిలేదని, కఠిన చర్యలు తీసుకొంటామని హెచ్చరించారు. జీతాలు ఎంతెంత పెరిగాయని సిబ్బందిని ప్రశ్నించిన ఆయన జీతాలు పెరగడంతోపాటు బాధ్యతలు తెలుసుకోవాలన్నారు. కరెంటు కొంటున్నామన్న విషయాన్ని గుర్తుంచుకొని అక్రమ విద్యుత్ వాడకాన్ని అరికట్టాలని సూచించారు. విద్యుత్ సరఫరా బాగా ఇస్తే సిబ్బందిపై గౌరవం ఏర్పడుతుందన్నారు. మీటర్ రీడింగ్‌ల నమోదులో సిబ్బంది సక్రమంగా వ్యవహరించాలన్నారు. రికార్డులను పరిశీలించిన ఆయన ఎడిఇ అనిల్ కుమార్ పనితీరును ప్రశంసించారు. ఈ కార్యక్రమంలో సిఇ రాంసింగ్, ఎస్ఇ నంద కుమార్, డిఇలు వెంకటేశ్వర్లు, జగన్మోహన్ తదితరులు పాల్గొన్నారు.

# మత్స్యకారులకు అందని ప్యాకేజి!

• కృష్ణపట్నం మత్స్యకారుల లబోదిబో

కృష్ణపట్నం పోర్టు ఏర్పాటు కారణంగా జీవనాధారం కోల్పోయిన మత్స్యకారులకు అందిస్తామన్న ప్యాకేజి ఇంతవరకు అందకపోవడం పట్ల మత్స్యకారులు ఆవేదన చెందుతున్నారు. వేటను నమ్ముకొని జీవనం సాగిస్తున్న వీరికి పోర్టు యాజమాన్యం, అధికారులు, ప్రజాప్రతినిధులు ఇచ్చిన హామీ ప్రకారం సహాయం అందజేయకపోవడంతో వీరు ఒడ్డునపడ్డ చేపల్లా కొట్టుమిట్టాడుతున్నారు. పోర్టు డ్రెడ్జరు పనులతో తోటపల్లి గూడూరు, ఇందుకూరుపేట మండలాల్లోని మత్స్యకారులు చేపలవేట సాగించలేక, ఇతర పనులు చేయలేక వలస పోతున్నారు. గన్నవరం పోర్టు బాధితుల మాదిరి సహాయం అందేలా




చూస్తామని, స్థానికులకు ఉద్యోగావకాశాలు కల్పిస్తామని చెప్పినా ఆచరణలో మాత్రం మత్స్యకారులకు ఎలాంటి ప్రయోజనం చేకూరలేదు. ఆందోళన చేపట్టినప్పుడు మాత్రం హామీలివ్వడం, ఆ తర్వాత వీరి గురించి పట్టించుకోకపోవడంతో మత్స్యకారుల్లో తీవ్ర ఆగ్రహావేశాలు వ్యక్తమవుతున్నాయి.



తోటపల్లి గూడూరులో జరిగిన ప్రజాపథం కార్యక్రమంలో పాల్గొన్న సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి. ప్రక్కన జడ్పీచైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, చిల్లకూరు సుధీర్‌రెడ్డి.




మనుబోలు మండలం వీరంపల్లి గ్రామంలో తన తల్లితండ్రుల స్మృత్యర్థం ఏర్పాటుచేసిన మెగా ఉచిత కంటి వైద్య శిబిరంలో మాట్లాడుతున్న బద్దెవోలు శ్రీహరిరెడ్డి. వేదికపై జిల్లా ఎస్పీ దామోదర్, డాక్టర్ పిఎల్.రావు, డాక్టర్ కృష్ణమూర్తి వున్నారు.

# రైతులను విస్మరిస్తున్న కాంగ్రెస్ ప్రభుత్వం

## సోమిరెడ్డి విమర్శ

కాంగ్రెస్ పార్టీ రైతులను విస్మరిస్తోందని, వారి బాగోగులు పట్టించుకోవడం లేదని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి విమర్శించారు. తోటపల్లి గూడూరు మండలం సౌత్‌ఆములూరు గ్రామంలో పార్టీ సభ్యత్వ నమోదు కార్యక్రమాన్ని చేపట్టిన ఆయన కాంగ్రెస్ ప్రభుత్వ తీరుపై విరుచకపడ్డారు. పండించిన పంటకు గిట్టుబాటు ధర లేక రైతులు 200 కోట్లు నష్టపోయారని వివరించారు. రైతులు నష్టపోతుంటే వారి గురించి పట్టించుకోకుండా అధికార పార్టీ శాసన సభ్యులు సొంత వ్యాపారాల్లో నిమగ్న మయ్యారని విమర్శించారు. స్థానిక సంస్థల ఎన్నికల్లో తెలుగుదేశం పార్టీకి పూర్వ వైభవం తెచ్చేందుకు కార్యకర్తలు, నాయకులు కృషి చేయాలన్నారు. శ్రీకృష్ణ కమిషన్‌కు తామిచ్చిన నివేదికపై సభ్యులు ఆసక్తిగా పరిశీలించారని తెలిపారు. లక్షా ఇరవై వేల సాధారణ సభ్యత్వం, లక్షా యాభైవేల క్రియాశీలక సభ్యత్వాన్ని లక్ష్యంగా పెట్టుకొన్నామన్నారు. ఈ కార్యక్రమంలో మండల నాయకులు బొమ్మి సురేంద్ర, సోమిరెడ్డి శ్రీనివాసులురెడ్డి, గోపాల్ నాయుడు, చావా కోటయ్య నాయుడు, కోడూరు శ్రీనివాసులురెడ్డి, జితేంద్ర, రమణారెడ్డి, సుధాకర్ తదితరులు పాల్గొన్నారు.



# దగదర్తిలో ఆగని గ్రావెల్ త్రవ్వకాలు!

- **తహశీల్దార్‌కు పట్టదా?**

దగదర్తి మండలంలో గ్రావెల్ అక్రమ త్రవ్వకాలు జోరుగా సాగుతున్నాయి. అక్రమార్కులకు అధికారుల అండదండలు పుష్కలంగా వుండడంతో ప్రభుత్వ, అటవీ భూములు, పోరంబోకు భూముల్లో గ్రావెల్ త్రవ్వకాలు ఇష్టానుసారంగా జరుగుతున్నాయి. సున్నపుబట్టి వద్ద వున్న చెరువులో జెసిబిలు, పెద్ద సంఖ్యలో టిప్పర్లు వినియోగించి భారీగా త్రవ్వకాలు కొనసాగిస్తున్నారు. ఈ అక్రమ త్రవ్వకందారులకు తహశీల్దార్ కార్యాలయ సిబ్బంది కొందరు సహకారం అందిస్తుండడంతో రాత్రి పగలు అన్న తేడా లేకుండా గ్రావెల్ త్రవ్వకాలు జరుగుతున్నాయి. మండలంలో ఉపాధిహామీ పథకం క్రింద చేపట్టిన అంతర్గత రహదారుల కోసం ఈ గ్రావెల్‌ను తరలిస్తున్నారు. అధికారుల నుంచి ఎలాంటి అనుమతులు తీసుకోకుండా త్రవ్వకాలు జరుపుతున్నా అధికారులు పట్టించుకోకపోవడం వెనుక నగదు చేతులు మారినట్లు తెలుస్తోంది. మండల కార్యాలయానికి వెళ్లే దారిలో బహిరంగంగా జరుగుతున్న గ్రావెల్ త్రవ్వకాలను ఆపడానికి ఎటువంటి చర్యలు తీసుకోవడం లేదు. ఇప్పటికైనా అధికారులు నిద్రమేల్కొని నిలుపుదల చేయాలని స్థానికులు కోరుకొంటున్నారు.

## ముత్తుకూరులో మునిగిన శనగ రైతులు

ముత్తుకూరు మండలంలోని శనగరైతులు నష్టాలను చవిచూస్తున్నారు. లక్షల రూపాయలు ఖర్చుపెట్టి పంటసాగు చేసినప్పటికీ తగినంత ఆదాయం లభించకపోవడంతో రైతులు ఆవేదన చెందుతున్నారు. మండలంలోని పంటపాళెం, కోళ్లమిట్ట, సుబ్బారెడ్డిపాళెం, కొత్తపాళెం, తూర్పు నాగదొరువు, పడమర నాగదొరువు తదితర ప్రాంతాలలో పెద్దసంఖ్యలో పంటసాగు చేశారు. అప్పుసొప్పు చేసి వేరుశనగ పండించినా శ్రమకు తగిన గిట్టుబాటు ధర లభించడంలేదని రైతులు వాపోతున్నారు. దిగుబడి గణనీయంగా తగ్గిపోయింది. ఎకరాకు 6 నుంచి 7 క్వింటాళ్ల పంట రావాల్సివుండగా 3 క్వింటాళ్లు అంతకంటే తక్కువ దిగుబడి వస్తుండడంతో రైతులు దిగులు చెందుతున్నారు. వేల రూపాయలు కౌలు చెల్లించి, విత్తనాలు, పురుగు మందులు తదితరాలకు పెద్దమొత్తంలో డబ్బులు ఖర్చు చేసిన తమకు పంటకు గిట్టుబాటు ధర రాకపోవడంతో నష్టపోవాల్సి వస్తోందని శనగ రైతులు వాపోతున్నారు.

## గ్రామ రెవిన్యూ కార్యాలయాలకు శ్రీకారం

రాష్ట్రంలో ఎక్కడా లేనివిధంగా జిల్లాలోని ఆత్మకూరు మండలంలో గ్రామస్థాయిలో రెవిన్యూ కార్యాలయాల ఏర్పాటు కావడం పట్ల సర్వత్రా హర్షం వ్యక్తమవుతోంది. గ్రామస్థాయిలో ప్రజల సమస్యలు పరిష్కారం కావాలని కాంక్షిస్తూ తహశీల్దార్ ఎస్.శ్రీనివాసమూర్తి విఆర్వో కార్యాలయాల ఏర్పాటుకు శ్రీకారం చుట్టారు. మండలంలోని బోయినచిరువెళ్ల, వెంకట్రావుపల్లె, నారంపేట, కరటంపాడు గ్రామాల్లో ఈ కార్యాలయాలు ఏర్పాటయ్యాయి.

రాష్ట్ర మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ప్రాతినిధ్యం వహిస్తున్న ఆత్మకూరు నియోజకవర్గంలో ఇలాంటి కార్యాలయాలకు శ్రీకారం చుట్టడం పలువురి మన్ననలు అందుకొంటోంది. గ్రామస్థాయిలో సాధ్యమైనంత మేర సమస్యలను పరిష్కరించి, ఇతర సమస్యలను ఆయా శాఖలకు పంపేలా చర్యలు చేపట్టారు. నెల్లూరు ఆర్డీఓ వేణుగోపాలరెడ్డి ఈ గ్రామ రెవిన్యూ కార్యాలయాల ఏర్పాటును ప్రశంసించారు. జిల్లాలో ఆత్మకూరు మండలం ఆదర్శం కానుందని పలువురు వ్యక్తం చేస్తున్నారు.

## సబితకు 'చెక్'

రాష్ట్ర హోం మంత్రి సబితా ఇంద్రా రెడ్డికి సిఎం రోశయ్య 'చెక్' పెడుతున్నాడా! అంటే అవుననే అంటున్నారు కాంగ్రెస్ పెద్దలు. సబితా ఇంద్రారెడ్డి పని తీరు పట్ల రోశయ్య అసంతృప్తిగా వున్నారట. చెల్లెమ్మ సెంటిమెంట్‌తో వై.ఎస్ ఆమెకు హోంశాఖ ఇచ్చాడే తప్ప ఆమె సామర్థ్యాన్ని గుర్తించి మాత్రం కాదన్నది రోశయ్య విశ్లేషణ. వై.ఎస్ మరణం తర్వాత సబిత మెల్ల మెల్లగా రోశయ్య పక్కన చేరుతున్నదని గాంధీ భవన్‌లో గుసగుసలాడుకుంటున్నా రోశయ్య మాత్రం సబితను ఇప్పటికీ వై.ఎస్ వర్గీయురాలు గానే భావిస్తున్నట్లు వినికిడి. అందుకే చెల్లెమ్మ సెంటిమెంటుకు కూడా రోశయ్య తెరదించాడు. రాష్ట్రప్రభుత్వం ఏ పథకం చేపట్టినా చెల్లెమ్మ 'చేవెళ్ల' నుంచే ప్రారంభించడాన్ని వై.ఎస్ ఆనవాయితీగా మార్చాడు. రోశయ్య మాత్రం ఇందుకు భిన్నంగా ప్రజాపథం కార్యక్రమాన్ని తన సొంత నియోజకవర్గం చీరాలలో ప్రారంభించాడు. చూస్తున్నావా! సబితమ్మా! అన్ని రోజులూ ఒకేలా వుండవంటే ఇదేమరి!

## ఎమ్మెల్సీల 'ఆనందం'



త్వరలో జరిగే మంత్రివర్గ విస్తరణలో ఎమ్మెల్యేలతోపాటు శాసనమండలి సభ్యులకు కూడా చోటు కల్పిస్తానని రోశయ్య ప్రకటించడంతో ఎమ్మెల్సీలు తెగ ఆనందపడుతున్నారు. సిఎం ప్రకటన వచ్చిన దగ్గర నుంచి ఆశావహులంతా రోశయ్య చుట్టూ చక్కర్లు కొడుతున్నారు. శాసనమండలి ఛైర్మన్ చక్రపాణి, డిప్యూటీ ఛైర్మన్ మహమ్మద్ జానీ కూడా చక్కర్లు కొట్టేవారిలో వుండటం విశేషం. అయితే రోశయ్య మాత్రం తన కిష్టమైన రుద్రరాజు పద్మ రాజు వంటి వాళ్లను మంత్రివర్గంలోకి తీసుకోడానికే ఈ నిర్ణయం తీసుకున్నాడంటూ గాంధీభవన్‌లో చెవులు కోరుక్కుంటున్నారు. రోశయ్య ఏం చేసినా అందులో ఏదో వుంటుందంటూ ఎమ్మెల్యేలు గొణుక్కుంటున్నారట! చూద్దాం!! ఏం జరుగుతుందో!!

## హెలికాప్టర్ అంటే హడల్!



వై.ఎస్ ప్రమాదం జరిగినప్పటి నుంచి హెలికాప్టర్ అంటే హడలెత్తిపోతున్నాడు రోశయ్య. హెలికాప్టర్ కండిషన్‌లో వుండి, పగటి వేళల ప్రయాణమైతేనే రోశయ్య క్లియరెన్స్ ఇస్తున్నాడు. వేళకాని వేళల్లో అయితే మాత్రం నో హెలికాప్టర్ అంటున్నాడట. ప్రజాపథం కార్యక్రమానికి వెళ్లడానికి హెలికాప్టర్‌ను సిద్ధం చేస్తే వద్దని వారించాడట. చీరాల ఎంత దూరమయ్యా! రాత్రికి రైలెక్కితే తెల్లారే దిగొచ్చు! అంటూ రైలు ప్రయాణానికి జెండా వూపాడు. రోశయ్య నిర్ణయాలు సెక్యూరిటీ వారికి మాత్రం చికాకెత్తిస్తున్నాయి. అసలే సిఎం... నక్సలైట్ల బెదిరింపులున్నాయి. ఈ పరిస్థితుల్లో రోశయ్య రైల్లోనో, కారులోనో ప్రయాణించడం క్షేమంకాదని సెక్యూరిటీ సిబ్బంది మొత్తుకుంటున్నారు. పనిలో పనిగా ఓ చిన్న విమానం కొనేస్తేపోలా! అంటూ సెక్యూరిటీ వింగ్ ఓ ప్రతిపాదన కూడా చేసింది. సిఎం తలుచుకుంటే విమానానికి కొరతా! ఏమిటి !!

## కెవిపిపై డిఎస్ 'గుర్రు'



ప్రభుత్వసలహాదారు కె.వి.పి రామచంద్ర రావుపై పిసిసి చీఫ్ డి.ఎస్. గుర్రుగా వున్నాడు. శాసనమండలి టిక్కెట్టు తనకు దక్కకుండా చేయడంలో కెవిపి చక్రం తిప్పాడని డిఎస్ తెగ బాధపడిపోతున్నాడు. వై.ఎస్ వున్నప్పుడు సరే... రోశయ్య హయాంలో కూడా కెవిపి హవానే కొనసాగుతోందంటూ డిఎస్ వాపోతున్నాడు. శాసనమండలికి ఎన్నికై రోశయ్యకు 'చెక్' పెట్టాలని డిఎస్ భావించాడు. పిసిసి చీఫ్ కాబట్టి ఎమ్మెల్సీ టిక్కెట్ సునాయాసంగా దక్కుతుందనుకున్నాడు. అయితే కెవిపి ముందస్తు వ్యూహం ప్రకారం పార్టీకి సంబంధం లేని కాసాని జ్ఞానేశ్వర్‌కు, గల్లీస్థాయి కార్యకర్త ప్రభాకర్‌కు టిక్కెట్లను ఇప్పించాడు. దీంతో డి.ఎస్ పరువు పోయింది. పైకి కెవిపి పేరు వినపడుతున్నా దీనివెనుక రోశయ్య హస్తముందన్నది డిఎస్ అనుమానం. అన్నట్టు ఈ మధ్య రోశయ్య కూడా డిఎస్‌ను దగ్గరకు రానివ్వడం లేదట. రోశయ్య అపాయింట్‌మెంట్ కోసం డిఎస్ వేచివుండాల్సిన పరిస్థితి ఎదురవుతోంది. రోశయ్యా! మజాకానా! అనుకుంటున్నారు తెలిసినవారంతా !!

## ఓదార్పు! బలమా? వాపా??



జగన్ నిర్వహించిన ఓదార్పు యాత్ర విజయవంతం కావడంతో వై.ఎస్ వర్గీయులు తెగ సంబరపడిపోతున్నారు. జగన్ యాత్రకు ఊహించని స్పందన వచ్చిందని, రాష్ట్రంలో వై.ఎస్‌కు ప్రత్యామ్నాయం జగన్ మాత్రమేనంటూ వారు ఆనందడోలికల్లో ఊగిపోతున్నారు. అయితే జగన్ యాత్రకు హాజరైనా జనం స్వచ్ఛందంగా రాలేదని, స్థానిక నాయకులు బలవంతంగా తోలారని ఇంటెలిజెన్స్ వర్గాలు సిఎంకు 'రహస్య' నివేదికను అందజేశాయట. జగన్ ఓదార్పు యాత్ర జరిగినంతకాలం ఇంటెలిజెన్స్ వారు కంటికి కునుకు లేకుండా వున్నారట. ఈ యాత్రలో ఎవరెవరు ఓవర్ యాక్షన్ చేసిందీ ఎప్పటికప్పుడు సిఎంకు వర్తమానం పంపడంలో ఇంటెలిజెన్స్ తెగ కష్టపడిందట. అలాగే ప్రభుత్వానికి, సిఎంకు వ్యతిరేకంగా జగన్ చేసిన వ్యాఖ్యల్ని కూడా ఇంటెలిజెన్స్ వర్గాలు రికార్డు చేశాయట. వీటిని అధిష్టానానికి అందజేస్తారని సిఎం సన్నిహిత వర్గాలంటున్నాయి. ఏదైతేనేం! జగన్ జనంలోనికి వెళ్లాడని వై.ఎస్ వర్గీయులు సంబరపడుతున్నారు.

## అబ్బే! మాది తెనాలి సంబంధమే!!



చుట్టూ కోటరీ చేరడంతో చంద్రబాబు కార్యకర్తలకు దూరమవుతున్నాడంటూ వివాదాస్పద వ్యాఖ్యలు చేసి రచ్చకెక్కిన తెలుగుదేశం ఎమ్మెల్సీ నన్నపనేని రాజకుమారి 'బాబు'ను కలుసుకొని 'వివరణ' ఇచ్చుకున్నది. రోశయ్యకూ తనకూ మధ్య ఎటువంటి 'రాజకీయ' సాన్నిహిత్యం లేదని, ఇరువురం 'తెనాలి' వారమే కాబట్టి 'క్లోజ్'గా వున్నమాట వాస్తవమేనని రాజకుమారి చెప్పుకుందట. పార్టీ, అధినేత బాగుండాలని కోరుకొనేదాన్నే కాని పార్టీకి వెన్నుపోటు పొడిచేతత్వం కాదని నన్నపనేని కళ్లనీళ్లు కూడా పెట్టుకుందని అక్కడున్న వాళ్లు చెప్పుకుంటున్నారు. అయితే ఆరోజు తన పుట్టినరోజు కావడంతో 'బాబు' తమాయించుకున్నాడట. పుట్టిన రోజున ఆడపడుచు కంటతడి మంచిదికాదంటూ పక్కనే వున్నవాళ్లు వారించడంతో బాబుకు శుభాకాంక్షలు చెప్పి రాజకుమారి 'బయటపడింది' !!

## తాగించండి! సంపాదించండి!!

ఎండాకాలంలో మంచినీటికి కరువుందేమో కానీ సారా బాబులకు మాత్రం కడుపునిండా మందుకు మాత్రం కొరత లేకుండా ప్రభుత్వం జాగ్రత్త పడుతోంది. రాష్ట్ర ఖజానా ఖాళీ కావడంతో ప్రభుత్వం మద్యం అమ్మకాల్ని పెంచి తద్వారా ఆదాయాన్ని రాబట్టాలని లక్ష్యాల్ని నిర్దేశిస్తోంది. 'తాగినోడికి తాగినంత' అన్న చందంగా మద్యానికి కరువు లేకుండా సరఫరా చేయాలని ఎక్సైజ్ కమిషనర్ మద్యం కంపెనీలకు తాకీదులు జారీ చేశాడు. అలాగే ఈ ఏడాది రికార్డు స్థాయిలో మద్యం అమ్మకాలు జరిగేలా అధికారులకు లక్ష్యాలను నిర్దేశిస్తున్నాడు. గత యేడాది కంటే ఈ యేడాది మద్యంపై ఎక్కువ సొమ్మును రాబట్టాలంటూ అధికారులపై ఒత్తిడి చేస్తున్నాడు. గత యేడాది ఎన్నికల పుణ్యమా అంటూ ఆదాయం వచ్చింది. ఈ యేడాది కరవు, ఆర్థిక మాంద్యంతో ఎక్సైజ్ ఆదాయం బాగా తగ్గింది. ప్రభుత్వధోరణి చూస్తుంటే బలవంతంగా అయినా తాగించేట్టున్నారు !! చూద్దాం !





జాతియొక్క ప్రాచీనచరిత్ర, సంస్కృతి, సభ్యత, భగవదాచార వివరాలను దైవస్తుతిని తెలియజేసేవే పురాణాలు. దేశ ఆధ్యాత్మిక సంస్కృతి సాంప్రదాయాలలో పురాణ ప్రయోజనం ఎంతో వుంది. సృష్టి రచన, మహర్షుల వివరం, ధార్మిక మనస్తత్వం, యజ్ఞ యాగాదులు, శాస్త్ర అధ్యయనాల గురించి ఈ పురాణాలలో చెప్పబడింది. వేదవ్యాస మహర్షి వేదాల లక్ష్యసిద్ధిని సరళంగా పురాణాల ద్వారా అందించారు. మొత్తం 18 పురాణాలు వుండగా మరో 36 ఉప పురాణాలు అదనం. శతకోటి శ్లోకాలతో ఇమిడివున్న ఈ పురాణాలను వ్యాసుడు నాలుగు లక్షలకు కుదించి వాటిని 18 పురాణాలలో రూపాంతరించారని చెప్తారు. వీటిలో కొన్ని పురాణాలు వేదాలకు సమకాలీకం అనీ, మరికొన్ని వేదాలకు ముందని చెప్తుంటారు.

### బ్రహ్మ పురాణం

ఇది ప్రాచీన మొదటి మహాపురాణం. సృష్టికర్తను స్తుతించిన పురాణం.

### పద్మ పురాణం

ఐదు ఖండాలుగల ఈ పురాణంలోనూ బ్రహ్మదేవుని స్తుతిస్తూ చెప్పబడింది.

### విష్ణు పురాణం

ఈ పురాణంలో విష్ణు భక్తి గురించి ప్రధానంగా ప్రబోధించారు.

### వాయు పురాణం

దీనిని శివపురాణంగా పరిగణిస్తారు. శైవులకు ఆరాధ్య పురాణం.

### మార్కండేయ పురాణం

మార్కండేయ చరిత్రతోపాటు 9వేల శ్లోకాలు కల్గిన బృహత్‌గ్రంథం.

### లింగ పురాణం

లింగ పూజలలోని శక్తిని, పూజావిధానాన్ని విపులంగా వర్ణింపబడింది.

### స్కంద పురాణం

పార్వతి పరమేశ్వరుల పుత్రుడైన స్కందుడుచే చెప్పబడిన పురాణమే ఇది. శివపార్వతుల లీలలు ఈ పురాణంలో చెప్పడ్డాయి.

### నారద పురాణం

నారద మహర్షిచే ప్రవచించబడిన ఈ పురాణం అనితరమైన విష్ణు భక్తిని ప్రబోధిస్తుంది. వైష్ణవ భక్తులకు ముఖ్యమైనది.

### శ్రీ మద్భాగవత పురాణం

భక్తితత్వానికి సంబంధించిన ఈ పురాణంలో సృష్ట్యారంభ వర్ణనలు వున్నాయి.

### వరాహపురాణం

విష్ణువు వరాహ అవతారం గురించి చెప్తుంది ఈ పురాణం.

### వామన పురాణం

వామనావ తార కథే వామన పురాణం.

### అగ్ని పురాణం

భగవంతుని అవతారాలు, దేవాలయ నిర్మాణశాస్త్రం, విగ్రహ శాస్త్రాలను చెప్పేదే అగ్ని పురాణం.

## పురాణ పఠనంతో మంచి జరుగుతుంది!

### బ్రహ్మ వైవక్త పురాణం

కృష్ణభక్తిని ప్రబోధిస్తుంది. రాధాకృష్ణుల భక్తి తత్వాన్ని తెలియచెప్పడం దీని ఉద్దేశం.

### మత్స్య పురాణం

అవతారగాధలకు సంబంధించిన పురాణం. దాన ధర్మాలు, జపతపాల ప్రాశస్త్యాన్ని వివరించబడింది.

### కూర్మ పురాణం

విష్ణుమూర్తి అవతారాలను తెలియజెప్పే పురాణం. శివ కేశవుల ఏకత్వాన్ని తెలుపుతుంది.

### భవిష్య పురాణం

భవిష్యత్తును గురించి తెలియజెప్తుంది.

### బ్రహ్మాండ పురాణం

విశ్వాన్ని గురించి వివరంగా చెప్పడంతోపాటు భూగోళ, భూగర్భ, ఖగోళ శాస్త్రాలను వివరించబడింది.

### గరుడ పురాణం

విద్యను గురించి, శాస్త్రాల గురించి, గీతా సారం గురించి చెప్పబడింది.

## ట్రంకు రోడ్డు



### గీత చెప్పిన ఇస్రో ఛైర్మన్



శ్రీహరికోటలోని షార్ అంతరిక్ష కేంద్రం నుంచి రాకెట్ పైకి వెళ్లిన తర్వాత దాని విజయం తాలుకు పూర్వాపరాలను విలేకరులకు ఇస్రో ఛైర్మన్ వివరించడం రివాజు. ఈ సందర్భంగా ఆయన చెప్పే ఫిజిక్స్, కెమిస్ట్రీ సూత్రాలు అర్ధంకాక పలు మీడియా ప్రతినిధులు తెల్లమొఖాలేస్తుండేవారు. గతవారంలో స్వదేశీయంగా అభివృద్ధిపరచిన క్రయోజనిక్ ఇంజన్‌తో అంతరిక్షంలోకి పంపిన జిఎస్–ఎల్‌వి డి–3 రాకెట్ ప్రయోగం విఫలమయ్యాక తెల్లమొహం వేయడం ఇస్రో ఛైర్మన్ రాధాకృష్ణన్ వంతయ్యింది. 230 కోట్ల రూపాయల భారీ వ్యయం, 17ఏళ్ల శాస్త్రజ్ఞుల శ్రమ, అంతర్జాతీయంగా వచ్చిన అపఖ్యాతితో ఇస్రో ఛైర్మన్‌కు ఒక్కసారిగా భగవద్గీత గుర్తుకు వచ్చింది. కర్మణ్యేన వాదికారస్తే మా ఫలేషు కదాచన అంటూ విలేకరుల సమావేశం మొదలు పెట్టేసరికి బ్రహ్మప్రకాష్ సమావేశ మందిరంలోని వారంతా విస్తుపోయారు.

### ముగ్గురు అల్లుళ్లు



ఇదేమి సినిమా పేరు కాదు. నెల్లూరు నగరాన్ని ఆనుకొని వుండే కోవూరు నియోజకవర్గంలో తెలుగుదేశం పార్టీ మంచి చెడ్డలు చూసే బాధ్యతలు నియోజకవర్గానికి చెందిన ముగ్గురు తెలుగు అల్లుళ్లు స్వీకరించారు. ఇక్కడ నుంచి పార్టీ తరపున గెలిచిన నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డిని కాంగ్రెస్‌పార్టీ ఆకర్షించడంతో పార్టీ కాస్త బలహీనపడింది. దీనితో తెలుగుదేశం పార్టీకి పూర్వవైభవం తెచ్చే బాధ్యతను కోవూరు నియోజకవర్గంలోని గ్రామాల్లో పెళ్లి చేసుకొన్న జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి (మానేగుంటపాడు), బీద రవిచంద్ర (ఇందుకూరుపేట), జి.వి.శ్రీనాధ్‌రెడ్డి (బుచ్చి) గోదాలోకి దూకారు. చూడాలి ఈ ముగ్గురు అల్లుళ్లు పార్టీ ప్రభ ఏవిధంగా వెలిగిస్తారో?

### మనసులో మాట



ప్రజాపథం కార్యక్రమం ప్రారంభోత్సవాన్ని పురస్కరించుకొని 18తేది నెల్లూరు ఏసి సెంటర్‌లోని నగర కాంగ్రెస్ పార్టీ కార్యాలయంలో ఆనం సోదరులు కార్యకర్తల సమావేశం ఏర్పాటు చేశారు. ఏ సమావేశంలోనైనా ప్రత్యేకంగా కన్పించాలని తాపత్రయపడే రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి సమావేశం జరిగిన ప్రాంతంలో అటు ఇటు తిరుగుతూ మొబైల్ ఉపన్యాసం ఇచ్చారు. రెండు మూడుసార్లు నేలపై పరచి వుండిన కార్పెట్ తట్టుకొని పడబోయారు. ఆయన ఊకదంపుడు వుపన్యాసంలో మనసులోని భావాలు బయటపడ్డాయి. ప్రజాపథం కార్యక్రమంలో పార్టీ కార్యకర్తలు విరివిగా పాల్గొనాలి... ప్రభుత్వానికి బుద్ధి వచ్చేవిధంగా ప్రవర్తించాలనే సరికి కార్యకర్తలు విస్తుపోయారు. కార్యకర్తల ముఖాలలోని ఆశ్చర్యాన్ని రంగు కళ్లద్దాలలో నుంచి చూసిన వివేకా సర్దుకొంటూ ప్రతిపక్షాలకు బుద్ధి వచ్చే విధంగా అంటూ తన మాటలను కవర్ చేసుకొన్నారు.

### పుణ్యక్షేత్రాలలో పాపపు పనులు



కలికాలం. దేవుడంటే భయం, భక్తిలేని కాలం. పుణ్యక్షేత్రాలలో పాపపు పనులు ధైర్యంగా చేసే కాలం. జిల్లాలో మతాలకతీతంగా దర్శనీయ క్షేత్రాలు కసుమూరు, గొలగమూడి. ఇక్కడకు ప్రతినిత్యం వేల సంఖ్యలో భక్తులు వస్తుంటారు. వీరితోపాటు పాపపు పనులు చేసేందుకు కొన్ని జంటలు తరలివెళ్తున్నాయి. సరసమైన ధరలకు దొరికే అద్దెగదులలో సరస సల్లాపాలలో మునిగి తేలుతున్నారు. ఫిర్యాదులు ఎక్కువ కావడంతో 'వీడేరా పోలీసంటూ' రంగంలోకి దిగిన రూరల్ సిఐ జయరాంసుబ్బారెడ్డి చేతికి పెద్ద సంఖ్యలో పాపపు జంటలు చిక్కాయి. పుణ్యక్షేత్రాల పరువుతీయలేక వారిని తొలి తప్పుగా మందలించి పంపారాయన.

### పరసాను నిలదీసిన పోలీసు



పూర్వాశ్రమంలో అంబేద్కర్ ఓపెన్ యూనివర్సిటీలో ఆచార్యుడైన సూళ్లూరుపేట ఎమ్మెల్యే పరసా రత్నంకు ఎన్టీఆర్‌ను అనుకరిస్తూ మాట్లాడడం అలవాటు. ఈ అలవాటే ఆయనను రెండుసార్లు ఎమ్మెల్యే, ఒకసారి మంత్రిని చేసింది. ఇటీవల ఆయన నియోజకవర్గంలో పర్యటిస్తూ కాంగ్రెస్ పాలనలో అవినీతి పెచ్చుపెరిగిపోయిందని చెప్తూ దీనికి ఉదాహరణ నియోజకవర్గంలోని పోలీసులేనన్నారు. దీనితో ఆయనకు బందోబస్తుగా వచ్చిన సర్కిల్ ఇన్స్‌పెక్టర్, సబ్‌ఇన్స్‌పెక్టర్, పోలీసులు సమావేశంలోనే ఆయన తీరును నిరసించారు. మాటజారిన పరసా వారికి క్షమాపణ చెప్పి సర్దుకోవాల్సి వచ్చింది.




అనవసరంగా బాధదాయకమైన ఊహలకు గురి కావద్దు. మార్పులు, చేర్పులు, కూర్పులు జరుగవచ్చు. పైవారితో అభిప్రాయ భేదాలున్నా బయటపడనీయవద్దు. శ్రమకు తగ్గ ఫలితం లభించక పోవచ్చు. పనిభారం ఆవేశాన్నిస్తుంది. ఓపిక అవసరం. వివాహాది శుభకార్యప్రయత్నాలు సత్ఫలితాలనిస్తాయి. విద్యార్థులు ప్రయోజకులౌతారు. రాజకీయులకు ఓ మోస్తరుగా సాగుతుంది.




సంతాన మూలంగా ఉత్సాహకరమైన వార్త వింటారు. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. ధనాదాయవిషయంలో లోటుండదు. పురోభివృద్ధి అన్ని రంగాలలో ఉంటుంది. రాజకీయులకు అత్యంత అనుకూలమైన కాలం. విద్యార్థులకు మంచికాలం. వ్యాపారులు మంచి లాభాలనార్జిస్తారు. స్పెక్యులేషన్ లాభిస్తుంది. ఉద్యోగులు ప్రోత్సాహకరమైన వార్త వింటారు.




పొరసంబంధాలు చక్కగా ఉండవు. సంబంధం లేని విషయాల్లో తలదూర్చవద్దు. ఆరోగ్యవిషయంలో పెద్దగా చెప్పుకోతగ్గవేమీ లేవు. ప్రతి పని నిలిచి నిదానంగా చేయడం మంచిది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. భాగస్వాములతో జాగ్రత్త. దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలుండవచ్చు. విద్యార్థులకు ఒకమోస్తరుగా చదువు సాగుతుంది. ఉద్యోగులకు శ్రమాధిక్యత ఉంటుంది.




అనుకొన్నపనులన్నీ అనుకొన్నరీతిలో ప్రణాళికాబద్ధంగా జరుపుకున్నా ఏదో లోపం ఉన్నట్టు తోస్తుంది. ఆహారవిషయంలో జాగ్రత్త. అభిప్రాయ భేదాలు రాకుండా చూసుకోవాలి. ఉద్యోగవృద్ధి, వేతనవృద్ధి ఉంటుంది. చిరకాలంగా ఎదురు చూస్తూవచ్చిన శుభ ఫలితాలు అనుభూతిలోనికి వస్తాయి. శత్రువులు లొంగి నడుచుకొంటారు. వ్యాపారులకు అంత యోగదాయకమైన కాలం గాదు.




ప్రతి అడుగు ఆచితూచి వేయడం మంచిది. ఆప్తుల, విజ్ఞుల సలహాలు తీసుకోవాలి. అనవసరపు విషయాలలో జోక్యం చేసుకోకుండుట మంచిది. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. వ్యాపారులు భాగస్వాములవల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. పనివారితో కఠినంగా మాట్లాడవద్దు. రాజకీయులు తోటివారి ప్రవర్తనను జాగ్రత్తగా పరిశీలించాలి. పైవారిని విమర్శించకుండాలి.




ముందుచూపుతో అడుగేయాలి. ఆచరణలో సాధ్యంకాని రీతిలో ఆలోచిస్తారు. ఇతరులు బాధపడే రీతిలో నడుచుకోవద్దు. సంతానమూలంగా ఇబ్బందులుండవచ్చు. గుట్టుగా కాలం గడపడం మంచిది. ఆర్థిక విషయాలు అంతంతమాత్రమే. వ్యాపారులు ఖాతాదారులవల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. రాజకీయులకు తీరని వేదన చోటుచేసుకొంటుంది. ఎదురు చూచిన సత్ఫలితాలు దక్కవు.

# వారఫలాలు

*తేది 24-04-2010 నుండి 30-04-2010 వరకు మేషంలో రవి, బుధులు; వృషభంలో శుక్రుడు; కుంభంలో గురువు; కర్కాటకంలో కుజుడు; కన్యలో శని; ధనుస్సులో రాహువు; మిథునంలో కేతువు; సింహ, కన్య, తుల, వృశ్చికాల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

**సాధారణ ముహూర్తాలు**

26, 28, 30 తేదీల్లో ఉ.7.00గం.ల నుండి 8.30ల వరకు వృషభ లగ్నాన సుముహూర్తాలున్నాయి.

**ఏప్రెల్ తిథులు**

**అధిక వైశాఖ శుద్ధ**

| | | | |
|---|---|---|---|
| 24 శని | దశమి | ఉ.6.00 | గం.ల.వ |
| | ఏకాదశి | తె.3.25 | గం.ల.వ |
| 25 ఆది | ద్వాదశి | రా.12.46 | గం.ల.వ |
| 26 సోమ | త్రయోదశి | రా.10.09 | గం.ల.వ |
| 27 మంగళ | చతుర్దశి | రా.7.45 | గం.ల.వ |
| 28 బుధ | పౌర్ణమి | సా.5.39 | గం.ల.వ |
| **అధిక వైశాఖ బహుళ** | | | |
| 29 గురు | పాడ్యమి | సా.4.02 | గం.ల.వ |
| 30 శుక్ర | విదియ | సా.3.01 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com




కష్టసుఖాలు సమానంగా చోటు చేసుకొంటాయి. ఊహించినరీతిలో ధనాదాయం ఉంటుంది. ఆరోగ్యవిషయంలో కొంత మేలు. సంతానం యొక్క పురోభివృద్ధి ఆనందాన్నిస్తుంది. సోదరుల మూలంగా కూడ ఖర్చు అవవచ్చు. బంధుమిత్రుల సహాయసహకారాలు అందుతాయి. రియల్ ఎస్టేట్ పనులు ఊపందుకొంటాయి. భూభవనాలద్వారా ఆదాయమార్గాలు సులభతరమవుతాయి.




చిన్న చిన్న సమస్యలు పెద్దవి అవవచ్చు. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతనవస్త్రాభరణాలు కొంటారు. నోటికి కదుపుకు సంబంధించిన అనారోగ్య బాధలుంటాయి. ఆదాయానికి తగ్గ ఖర్చు ఉంటుంది. గృహనిర్మాణకార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులు సాయమందిస్తారు. కుటుంబంలో సమస్యలు తీరుతాయి. కళాకారుల ప్రతిష్ఠ పెరుగుతుంది. ఉద్యోగులకు శ్రమ అధికం.




ఆరోగ్యవిషయంలో శ్రద్ధ అవసరం. మూర్ఖపు పట్టుదలలు పనికి రావు. ఒకటికి రెండుమార్లు ఆలోచించి చేయడం మంచిది లేదా ఆప్తుల సలహాలు వినడం మంచిది. ధనవిషయాలలో లోటు లేదు. వివిధమార్గాలలో ధనప్రాప్తి అవకాశాలు. ఆగిన పనులు నిదానంగా సాగుతాయి. ఇతరులతో అభిప్రాయభేదాలు రావచ్చు. మాట నిలబెట్టుకోవడానికి శ్రమపడతారు. రాజకీయులకు ఉత్తమకాలం.




ధనవిషయంలో కటకట తొలగవచ్చు. సోదరులతో అభిప్రాయ భేదావకాశాలు. ఎదుటి వ్యక్తి అభిప్రాయాన్ని పూర్తిగా అవగాహన చేసుకోవాలి. వ్యాపారులకు గడచిన వారంలో కన్నా ఈవారం కొంత మేలు. అప్పులు తీరుతాయి. ఇంటిలో వివాహసంబంధవిషయాలు ప్రస్తావనకు వస్తాయి. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది. రాజకీయులకు దురదృష్టకాలం.




ఆర్థికవిషయాలు నెమ్మదిగా చక్కగా సాగుతాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. తండ్రి తండ్రివంటివారికి ఇబ్బందులుండవచ్చు. కొంత ప్రయత్నం తర్వాతనే పనులు సాగుతాయి. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. బయటవారికోసం ఖర్చు చేస్తారు. ప్రతి పనిలో దూకుడు వద్దు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు.




గడచినకాలం కన్నా మేలైన కాలం. విరోధులు తగ్గుముఖం పడతారు. పద్ధతి ప్రకారం పనులు నిర్వహిస్తారు. ప్రయాణాలు సుముఖంగా సాగుతాయి. ఆర్థిక లావాదేవీలు మీకు అనుకూలంగా ఉంటాయి. ఇన్నినాళ్ళు ఆటంకాలతో అడ్డుపడ్డ పనులు ఊపందుకొంటాయి. నూతన ఉద్యోగావకాశాలు లభించవచ్చు. భూభవనాలద్వారా ఆదాయమార్గాలు సులభతరమవుతాయి.

# అపార్టుమెంట్లు... అసంకల్పిత దోషాలు!

పి.రాజారెడ్డి — హైదరాబాద్

* రాజవీధి దక్షిణం, ప్లాట్లన్నీ తూర్పు, పడమరలుగా వున్నాయి.

ఈ విధానం వల్ల దక్షిణ దిశ భ్రష్టమవుతుంది. 'యమస్థాయీచ్యుతి' వల్ల స్త్రీ సమస్యలు ఎక్కువవుతాయి. వాస్తు యంత్రప్రతిష్ఠ కొంత ఊరటనిస్తుంది.

డాక్టర్ కుముదిని — సికింద్రాబాద్

* మెట్లకు, లిఫ్టుకూ ఎదురుగా ఇల్లు రావచ్చా?

ఎదురుగా రావడం 'దృష్టి దోష'మవుతుంది. ఇరుప్రక్కల యిళ్లు కూడా రాకూడదు. దోషం తీవ్రత తగ్గినా దోష ప్రభావం వుంటుంది.

కె.త్రిభువనారెడ్డి — సికింద్రాబాద్

* అపార్టుమెంట్లున్న ప్రాంతంలో 'ల్యాండ్ హౌస్' వుండవచ్చునా?

అలా వుండటం ఆరోగ్యరీత్యా శ్రేయస్కరం కాదు. 'తీవ్ర ఘాత ప్రతి' దోషం వల్ల యజమానిపై ఆర్థిక, అనారోగ్యాల దాడి వుంటుంది.

ఎం.కిరణ్‌రెడ్డి — ఖైరతాబాద్

* అపార్టుమెంటుపైన ఈశాన్యంలో ప్లాస్టిక్ వాటర్ ట్యాంకులుంచారు.

నైరుతి, వాయువ్యాలలో తప్ప మరెక్కడా అలాంటి ట్యాంకులు ఉంచకూడదు.

పి.వి.ఆర్.చౌదరి — గూడూరు

* ఈశాన్యం బెడ్‌రూం వుంది. అతిథులకివ్వవచ్చునా?

ఈశాన్యం బెడ్‌రూం వల్ల గృహ సమతుల్యత దెబ్బతింటుంది. పిల్లలకు రీడింగ్‌రూమ్ కోసం ఉపయోగించుకోండి. అల్మైరాలో దేవుడి ఫోటోలుంచి పూజించుకోవచ్చు.

పి.ఎస్.సుకుమారి — శ్రీకాళహస్తి

* ప్లాటు పూర్తి అయింది. ఇంకా ప్లాస్టరింగ్ కాలేదు. సిద్ధాంతికి చూపించాము.

ఇల్లయినా, ప్లాటయినా అయిదు స్థాయి సమయాల్లో సిద్ధాంతి చూసినపుడే వాస్తు దోషాలు రావు. వాస్తుయంత్ర ప్రతిష్ఠచేసి ఒకటి, రెండు మాసాల తర్వాత మీరు చేరవచ్చు.

కిరపరెడ్డి లింగారెడ్డి — కడప

* నేను కొనాలనుకున్న ప్లాటుకు వెనకాల ప్లాటు మరో దిశలోనూ, ప్రక్క ప్లాటు మరో కోణం చూస్తూ వుంది కొనవచ్చా?

అంత అస్తవ్యస్తంగా వున్న ప్లాటు ప్రాణాంతకమైనది. కోణాలు ప్లాటుకు తగలడమంటే మృత్యువును ఆహ్వానించడమే. కొనే ఆలోచన మానుకోండి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

ఎన్.గోవిందరెడ్డి — కందుకూరు

* పల్లెలో యిల్లు వాస్తు ప్రకారం సరిచేసుకున్నాము. గోడౌన్లు అమ్ముడుపోవడం లేదు.

నిర్మాణాలు అమ్మడానికి ముందు సంబంధిత యంత్రప్రతిష్ఠ జరగాలి. పూజావిధానాల్లో జంతు, పక్షి బలి నిషిద్ధం.

డాక్టర్ వై.వి.ఆర్.రెడ్డి — హైదరాబాద్

* అపార్టుమెంటు కొని బాడుగకిచ్చాను. హైదరాబాద్‌లో స్థిరపడ్డాను.

అపార్టుమెంటు వాస్తు సరిచేసుకోండి. హైదరాబాద్ యింట్లో ఈశాన్యం బాత్రూము తీసివేయండి. లక్ష్మీయంత్ర ప్రతిష్ఠ వల్ల మిమ్మల్ని వెంటాడుతున్న సమస్యలు తీరుతాయి.

పరిటాల సుందరమ్మ — గూడూరు

* ఇంట్లో ఆవులు, గేదెలు వీటి పెంపకం వల్ల ఆర్థికంగా కలిసి వస్తుంది.

వాయువ్యంలో 'గోశాల' వల్ల ఆర్థిక, ఆరోగ్యాలు వైభవంగా వుంటాయని అగస్త్యవాస్తు భరోసాయిస్తోంది.

టి.లక్ష్మీనరసు — గుంటూరు

* వృక్షాన్ని తీసివేశాక పిల్లలిద్దరూ బద్ధకంగా వుంటున్నారు. అత్తగారు అనారోగ్యంగా వున్నారు.

వృక్షవేధ ఆరుమాసాలని వశిష్ఠవాస్తు, ఆరు వత్సరాలని కృష్ణవాస్తు చెబుతున్నాయి. లక్ష్మీకృత వాస్తు యంత్రం వేధ నుంచి కుటుంబసభ్యుల్ని రక్షిస్తుంది.

# సైదాపురంలో అభివృద్ధి పనులకు గ్రహణం!

అంగట్లో అన్నీ వున్నా అల్లుడి నోట్లో శని అన్న చందంగా తయారయ్యింది సైదాపురం గ్రామ పంచాయితీ పరిస్థితి. లక్షలాది రూపాయలు పన్ను రూపంలో వసూలు చేస్తున్నా అభివృద్ధి సాధారణ గ్రామ పంచాయితీ కంటే అధ్వాన్నంగా వుంది. గ్రామ పంచాయితీలోని ప్రజలు వివిధ సమస్యలతో ఇబ్బందులు పడుతున్నా పట్టించుకునే దిక్కు లేకుండా పోయారు. పంచాయితీ పాలకవర్గంలో ఏర్పడిన విభేధాల కారణంగా అభివృద్ధిపై ఎవరు దృష్టి సారించలేక పోతున్నారు. దీంతో స్థానిక ప్రజలు పాలకవర్గం, అధికారుల తీరును తప్పుపడుతున్నారు.

సైదాపురం గ్రామ పంచాయితీ సర్పంచ్‌గా కాంగ్రెస్ పార్టీకి చెందిన మల్లారపు హేమమ్మ ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఈ పంచాయితీ పరిధిలో మొలకలపూండ్ల, కమ్మవారిపల్లె, దేవిశెట్టిపల్లి మజరాలు. వీటికితోడు ఎస్సీ, ఎస్టీ కాలనీలు వున్నాయి. 1500 కుటుంబాలు, ఆరు వేల మంది ఓటర్లున్నారు. 14 వార్డులు కలిగిన ఈ పంచాయితీలో త్రాగునీటి సమస్య, పారిశుధ్యం, డ్రైనేజి కాల్వల నిర్మాణం, వీధిలైట్ల సమస్యలు ప్రజల్ని పట్టి పీడిస్తున్నాయి. ఎస్సీ, ఎస్టీ కాలనీలోని అంతర్గత రోడ్లు చాలా అధ్వాన్నంగా వున్నాయి.



**త్రాగునీరు అందించాలి!**

త్రాగునీరు సక్రమంగా సరఫరా కాకపోవడంతో అనేక ఇబ్బందులు పడుతున్నాం. పంచాయితీ కొళాయిల ద్వారా నీరు విడుదల చేస్తున్నప్పటికి కొద్దిసేపటి తర్వాత నిలిపివేస్తున్నారు. అధికారులు స్పందించి త్రాగునీరు అందించేందుకు చర్యలు తీసుకోవాలి.

– అన్నం సుబ్బయ్య



**చీకట్లో వుంటున్నాం!**

విద్యుత్ లైన్ ఏర్పాటుచేసి వున్నప్పటికి విద్యుత్ సక్రమంగా సరఫరా కావడం లేదు. దీంతో రాత్రి సమయంలో చీకట్లో వుండాల్సి వస్తుంది. ఊరి శివారున వున్న కాలనీలో రోడ్లు నిర్మించేందుకు అధికారులు కృషి చేయాలి.

– కోటమ్మ

రాష్ట్ర ప్రభుత్వం నుంచి 12వ ఆర్థిక సంఘం, ఎన్.ఎఫ్.సి నిధులు దాదాపు లక్ష రూపాయల వరకు ప్రతి సంవత్సరం గ్రాంటు కింద విడుదలవుతుంటాయి. ఇవికాకుండా పన్నుల రూపంలో మరో రెండు లక్షల రూపాయల వరకు ఆదాయంగా వస్తుంది. గ్రామ పంచాయితీకి రెగ్యులర్ కార్యదర్శిని నియమించకపోవడంతో పూటుకూరు కార్యదర్శిని ఇన్‌ఛార్జిగా నియమించారు. ఈ కార్యదర్శి రెండు గ్రామ పంచాయితీలలో సక్రమంగా విధులు నిర్వహించలేక పోతున్నాడు.

మహిళ గ్రామ సర్పంచ్ కావడంతో పంచాయితీ కార్యాలయంలో ప్రజలకు అందుబాటులో లేకుండా పోతుంది. ఊరికి శివారున ఏర్పాటుచేసిన గిరిజన కాలనీలో త్రాగునీటి వసతి, విద్యుత్ సౌకర్యం లేక ఇక్కట్లు పడుతున్నారు. అధికారులకు ఎన్నిసార్లు విన్నవించినా కూడా సమస్యలు పరిష్కారం కావడంలేదని గ్రామస్తులు వాపోయారు. ఈ క్రమంలో పంచాయితీ సమస్యలపై స్థానికులు వెల్లడించిన అభిప్రాయాలు ప్రక్కనిస్తున్నాం.



సైదాపురం పంచాయితీ కార్యాలయం.



అసంపూర్తిగా ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణ పథకం.

# పసలేని 'ప్రస్థానం'!



✍ అల్లూరు రహీం

రాజకీయం ఎంత క్రూరమైనదో అది ఒకే రక్తం పంచుక పుట్టిన వారిని సైతం ఎంత స్వార్ధపరులను చేస్తుందో చాటి చెప్పే చిత్రమే ప్రస్థానం. విఆర్‌సి మీడియా అండ్ ఎంటర్‌టైన్‌మెంట్ పతాకంపై వల్లభనేని రవి ఈ చిత్రాన్ని నిర్మించారు. ఈ చిత్రానికి కథ ప్రాణం. ఈ కథను దర్శకత్వ బాధ్యతలు కూడా చేపట్టిన దేవ కట్టానే వ్రాశారు. దర్శకునికి పూర్వాశ్రమంలో రంగస్థల నేపథ్యం వున్నట్లుంది. దీనివల్ల ఆ ఛాయల్లోనే చిత్రాన్ని నడపడం వల్ల ప్రేక్షకులను అంతగా ఆకట్టుకోలేదు. ఆద్యంతం చిత్రకథ రాజకీయం వెనుకనే నడుస్తుంది. ప్రేక్షకుల ఆటవిడుపు కోసం చిత్రంలో వీనుల విందైన సంగీతం, హాస్య కదంబం, ఆకట్టుకొనే హీరోయిన్ వంటి అంశాలేమి లేకుండా పోయాయి. దీనికి తోడు 'ప్రస్థానం' 17రీళ్ల సాగతీత కూడా ప్రేక్షకుల సహనానికి పరీక్ష పెడుతుంది. ఈ చిత్రంలో చెప్పుకోవాల్సినవి రెండే అంశాలు. నిలువెత్తు రాజకీయనాయకునిగా డైలాగ్‌కింగ్ సాయికుమార్ నటన, ఆయన మార్కు డైలాగులు. రెండో అంశం లవర్‌బాయ్ శర్వానంద్ పోషించిన రఫ్ అండ్ టఫ్ రౌడీ పాత్ర. దర్శకుడు చిత్రంలో డైలాగులపై మంచి శ్రద్ధ పెట్టాడు. పొడుగు పొడుగు డైలాగులు వ్రాశాడు. దొరికినంత దోచుకోవడం ఇప్పటి యిజం. భజనగాళ్ల మాటలు విని నాయకులు కావాలనుకొంటారు. నాయకత్వం వారసత్వం కాదు. ఎలక్షన్లు ఓ డ్రామా... ప్రజలు పెద్ద నటులు. రాజకీయం పులి మీద సవారిలాంటిది... ఒక్కసారి దిగితే తిరిగి ఎక్కలేం. మనిషి చరిత్ర యుద్ధాలతో మొదలయ్యింది. నీతి నిజాయితీలు కొవ్వొత్తులు... కొలిమిలో కరిగిపోతాయి. స్వార్ధమే మనిషి లక్షణం... ఈ కోవలేనివే. కొత్త సంగీత దర్శకుడు మహేష్‌శంకర్ బాణీలు కూర్చిన ఈ చిత్రంలో 'ఇన్నాళ్లుగా' చరణంతో సాగే డ్యుయెట్ పరవాలేదు. వనమాలి వ్రాసిన పాటల్లో లోకమంతా ఒకటిచేసి చరణంతో సాగే పాటలో 'పాపం చేసి మోక్షం చూశా' పదప్రయోగం ఆలోచింపచేస్తుంది. చిత్ర నిడివి కాస్త తగ్గించి. మిగతా అంశాలకు 'ప్రస్థానం'లో చోటు కల్పించి వుంటే ఈ చిత్ర ఫలితం మరోలా వుండేది.

ఇక చిత్రకథలోనికి వెళ్తే గన్నవరం నియోజవర్గ పరిధిలోని మానికొండ గ్రామానికి 30ఏళ్లుగా దశరథ రామయ్య నాయుడు(బాలయ్య) సర్పంచ్‌గా వుంటాడు. గ్రామంలో అక్రమసారా వ్యాపారంచేసే కోటగిరి ఎన్నికలు పెట్టాలని గ్రామసభలో గందరగోళం చేస్తాడు. ఏకగ్రీవంగా ఎన్నికలేకుంటే తాను బరిలో వుండనని దశరథరామయ్య నాయుడు ప్రకటిస్తాడు. ఈ సందర్భంగా ఇరువర్గాల మధ్య ఘర్షణ నెలకొంటుంది. దశరథరామయ్య నాయుడు కుమారుడు కేశవ పోటీకి దిగుతాడు. ప్రచారంలో ఆయన్ను కోటగిరి వర్గీయులు హతమారుస్తారు. దీన్ని తట్టుకోలేని దశరథరామయ్య నాయుడు ప్రధాన అనుచరుడు జగన్నాధం (సాయికుమార్) ప్రత్యర్థులను ఊచకోత కోస్తాడు. దీన్ని కేశవ కుమారుడు మిత్రా(శర్వానంద్) దగ్గరుండి చూస్తాడు. కొడుకు మరణంతో మంచానపడ్డ దశరథ రామయ్య జగన్నాధంను తన రాజకీయ వారసత్వంతోపాటు తన కుటుంబ బరువు బాధ్యతలు స్వీకరించమంటాడు. తన కోడల్ని పెళ్లి చేసుకొని ఆమె బిడ్డలను కాపాడమంటాడు. ఈ ప్రతిపాదన కేశవ కుమార్తె సావిత్రి (సురేఖావాణి) వ్యతిరేకించినా మిత్రా మాత్రం జగన్నాధం 'నాన్న' అని పిలుస్తాడు. గ్రామ రాజకీయాల్లో ఇమడలేక విజయవాడ వచ్చిన జగన్నాధంకు కేశవ భార్యకు పుట్టిన చిన్నా (నందీప్ కిషన్)కు చిన్నప్పటి నుంచి మిత్రా, సావిత్రి అంటే ఈర్ష్య. అతనికి విపరీతమైన స్వేచ్ఛ ఇవ్వడం వల్ల మాదకద్రవ్యాలకు బానిసై వారి కుటుంబాన్ని కంటికి రెప్పలా కాపాడుతుండే బాష కుమార్తె పైనే అత్యాచారం చేసి హత్య చేస్తాడు. పోలీసులు చిన్నాను అరెస్ట్ చేయగా జగన్నాధం ప్రత్యర్థి బాసిరెడ్డి (జీవా) బెయిల్ ఇచ్చి బయటకు తీసుకవస్తాడు. తనను తండ్రి ఆదరించకపోవడానికి మిత్రా అతని అక్క కారణమని కనిపెంచుకొన్న చిన్నా సావిత్రి కుటుంబాన్ని అంత మొందిస్తాడు. ఈ దశలో తండ్రిని చిన్నాను కలవగా జగన్నాధం రాజకీయ విశ్వరూపం ప్రదర్శిస్తాడు. నువ్వు నా రక్తం పంచుకొన్న బిడ్డవు.... నువ్వు హాయిగా బతుకు రాజకీయమనే పులి మీద సవారిని మిత్రా చేస్తాడంటాడు. తన కుతుర్ని హతమార్చిన చిన్నాను బాష హత్య చేస్తాడు. తండ్రిలో మార్పును తట్టుకోలేని మిత్రా స్వగ్రామం మానికొండ వెళ్తాడు. అక్కడకు సైతం జగన్నాధం అతన్ని చంపమని ఎన్‌కౌంటర్ స్పెషలిస్ట్ అయిన పోలీస్ అధికారిని పంపిస్తాడు. ఈ సమయంలోనే బాష మిత్రా తండ్రిని పూర్వాశ్రమంలో జగన్నాధంనే చంపాడని చెబుతాడు. దీంతో నేరుగా మిత్రా జగన్నాధం దగ్గరకు వెళ్లి ఈ ఘాతుకానికి ఒడిగట్టిన వ్యక్తిని నాన్నగానే చూస్తున్నానని చెప్పి చంపమని తుపాకి ఇస్తాడు. ఈ ప్రేమానుబంధానికి సిగ్గిల్లిన జగన్నాధం తుపాకితో కాల్చుకచావడంతో 'ప్రస్థానం' ముగుస్తుంది.






## విజయాలే ముఖ్యం!



ఉల్లాసంగా ఉత్సాహంగా, కరెంట్ చిత్రాలతో తెలుగు ప్రేక్షకులను అలరించిన హీరోయిన్ స్నేహావుల్లాల్‌కు అగ్రహీరో బాలకృష్ణ సరసన 'సింహా'లో నటించే ఛాన్స్ దక్కింది. షూటింగ్ గ్యాప్‌లో స్నేహాను సింహా తర్వాత పారితోషికం పెంచేస్తున్నారా? అని అడిగితే నాకు విజయాలే ముఖ్యం. పారితోషికం ఎంత పెరిగిందన్నది కాదు. నా చేతిలో ఎప్పుడూ సినిమాలుండాలి. నటిగా బిజీ కావడమే లక్ష్యం. ఏదో ఒక సినిమా హిట్ కాగానే, పెద్ద హీరోతో ఒక సినిమా చేయగానే పొగరుని తలకెక్కించుకోను. వచ్చే మంచి మంచి అవకాశాల్ని తిరిగి వెళ్లిపోయేలా చేసుకోనంది.

## అనితపై నిందమోపిన రాజు



మరోచరిత్ర సినిమా విషయంలో హీరోయిన్ సరిపోలేదని ఈ చిత్ర నిర్మాత దిల్ రాజు పేర్కొనడం సంచలనం సృష్టించింది. ఈ విషయమై హీరోయిన్ అనిత మాట్లాడుతూ మరోచరిత్రకు సంబంధించి ఆడిషన్స్ జరుగుతున్నప్పుడు నేను హైదరాబాద్‌లోనే వున్నాను. మాకు తెలిసిన వ్యక్తి ద్వారా ఆయన్ను కలిశాను. మా పాత్రకు సరిపోయేలా వున్నావు. హీరోతో జోడీ కూడా బాగుందన్నారు. షూటింగ్ జరిగినంత కాలం సరదాగానే గడచిపోయింది. కుటుంబసభ్యుల మధ్య వున్నంత సౌకర్యవంతంగా మెలిగాను. అలాంటిది రాజుగారు ఎందుకిలా మాట్లాడారో తెలియడం లేదు. మరోచరిత్ర నాకు ఎప్పటికీ ప్రత్యేకమైన చిత్రమే. దిల్ రాజు చేసిన వ్యాఖ్యలు నా కెరీర్ మీద దుష్ప్రభావం చూపుతాయని నేననుకోను. భవిష్యత్తులో పాత్రల ఎంపికలో మాత్రం ఆచితూచి అడుగులేస్తానంది.

## బాగా తింటాను



అంతర్జాతీయంగా పేరు ప్రఖ్యాతులు గాంచిన హీరోయిన్ శిల్పాశెట్టి నాజూకుగా కనిపించినా దీని కోసం కడుపును కాల్చుకోనంది. ఈ విషయమై మాట్లాడుతూ ఉదయం ఖర్జూరం, ఎండుద్రాక్ష, ఫ్రూట్‌సలాడ్, ఆపిల్ మధ్యాహ్న భోజన సమయంలో రోటీ, నెయ్యి, కూరగాయల ఫ్రై, కోడి కూర తింటాను. అందం కోసం పస్తులు వుండాలేంటి? అది నావల్ల కాదు. నేను మాత్రం ఇష్టమైన పదార్థాల్ని ఓ పట్టు పట్టకుండా వదలను. కాకపోతే రోజూ క్రమం తప్పకుండా వ్యాయామం చేస్తాను. చిన్నచిన్న చిట్కాలు పాటిస్తాను. సాయిబాబా భక్తురాలవడం వల్ల గురువారం మాత్రం మాంసాహారం తిననంది.

## అందం ఇనుమడించాలంటే...



యువతరం నాయికల్లో వెండితెరపై అందాన్ని నూటికి నూరుపాళ్లూ ఆవిష్కరించే తారల్లో షెర్లీన్‌చోప్రాను మొదటిగా చెప్పుకోవాలి. ఈమెను మీ గ్లామర్ రహస్యమేమిటంటే మనసు నిర్మలంగా వుంటే అందం ఇనుమడిస్తుంది. మంచి ఆలోచనలు వస్తాయి. మన మీద మనకు నమ్మకం పెరుగుతుంది. ప్రతిరోజూ మంచి విషయాలను తెలుసుకోను పుస్తకాలు చదువుతాను. నాకు భగవంతుడి మీద నమ్మకం జాస్తి. ఒత్తిడి దరిచేరనీయకుండా కూల్‌గా పని చేసుకొని వెళ్తానంది.

## మా మధ్య ఏం లేదు!



హీరోయిన్ సదా తెలుగు, తమిళ, కన్నడ భాషా చిత్రాలతోపాటు బాలీవుడ్‌లో నటించినా ఎక్కడా కుదురుకోలేకపోయింది. ప్రస్తుతం రెండు తమిళచిత్రాల్లో నటిస్తున్న ఆమె ఇటీవల హైదరాబాద్ వచ్చింది. ఈ సందర్భంగా ఆమెను కలసి తెలుగు చిత్రాలకు దూరమవుతున్నట్లుందే అంటే; అదేం కాదండి. ఏదో ఆలోచించకుండా తీసుకొన్న ఓ నిర్ణయం వల్ల అలా అయ్యిందండి. తమిళ హీరో మాధవన్‌తో ప్రేమాయణం సాగిస్తున్నారన్న ప్రచారాన్ని ప్రస్తావించగా 'ప్రియసఖి' చిత్రంలో నేను, మాధవన్ భార్యాభర్తల్లా సన్నిహితంగా నటించాల్సి వచ్చింది. మా మధ్య ఏదో వుందన్న గుసగుసలు అప్పటినుంచి మొదలయ్యాయి. ఇవి ఇంకా కొనసాగుతున్నట్లున్నాయి. మాధవన్‌నే కాదు ఆయన భార్య కూడా నాకు మంచి స్నేహితురాలు. కాబట్టి ఇబ్బందులు రాలేదని చెప్పుకొచ్చింది.

▶ ముత్తుకూరు బస్టాండ్ వద్ద

# ముందుకు కదలని ట్రాఫిక్



ఎటుబడితే అటుగా వాహనాలు.

నగర ట్రాఫిక్‌ను గాడిలో పెట్టేందుకు పోలీసులు ఒకవైపు చర్యలు చేపడుతుంటే మరోవైపు కొన్ని ప్రాంతాల్లో నడిచి వెళ్లలేని దుస్థితి నెలకొని వుంది. నిత్యం రద్దీగా వుండే విఆర్‌సి కూడలి, ముత్తుకూరు బస్టాండు వద్ద ట్రాఫిక్ అస్తవ్యస్తంగా వుంది. హరనాథపురం అండర్‌బ్రిడ్జి వైపు నుంచి విఆర్ కాలేజి వద్దకు వచ్చే రోడ్డును వన్‌వే చేశారు. వాహనాలు మద్రాస్ బస్టాండు మీదుగా తిరిగి రావాల్సి వున్నా అది అమలు కావడం లేదు. ట్రాఫిక్ రూల్సును అతిక్రమించి వన్‌వేలోనే వాహనాలు అంబేద్కర్ బొమ్మవైపు దూసుకు వచ్చేస్తున్నాయి. ఈ ప్రాంతంలో పండ్ల వ్యాపారుల బండ్లు ట్రాఫిక్‌కు తీవ్ర అంతరాయం కల్గిస్తున్నాయి. ఒకవైపు ముత్తుకూరు వెళ్లే బస్సులు నిలవడం, మరోవైపు అక్కడే బండ్లపై పండ్లు అమ్మేవారితో కిటకిటలాడుతోంది.

## ఈ సెంటర్‌పై దృష్టిపెట్టండి ఎస్పీగారు

ప్రధానంగా జయభారత్ హాస్పిటల్ వెళ్లే రోడ్డులో ట్రాఫిక్‌కు తీవ్ర అంతరాయం ఏర్పడుతోంది. అసలే ఇరుకుగా వుండే ఈ రోడ్డులో నిలిపిన ఆటోలు ఒకవైపు, మరోవైపు టిఫిన్ సెంటర్లు, అంగళ్ల నిర్వాహకులు రోడ్డుపైకి వచ్చి వుండడంతో నిత్యం ట్రాఫిక్ సమస్య ఎదురౌతుంది. సకాలంలో రోగులకు వైద్యచికిత్స కోసం వచ్చే అంబులెన్సులు, ఇతర వాహనాలు ఈ పద్మవ్యూహంలో చిక్కుకు పోతున్నాయి. ట్రాఫిక్‌పై ప్రత్యేక దృష్టి పెట్టిన ఎస్పీగారు ఈ ప్రాంతంపైనా దృష్టిసారించినట్లయితే మేలు జరుగుతుంది.

# కొట్లాట కేసుల్లో రాజీలేదు

కొట్లాటకు సంబంధించిన కేసుల్లో లోక్‌అదాలత్, సంబంధిత కోర్టుల్లో రాజీపడే అవకాశం ఇక లేదు. సాధారణంగా గ్రామాలు, పట్టణాల్లో తరచూ కొట్లాట కేసులు అధికంగా నమోదవుతుంటాయి. సెక్షన్ 324 క్రింద పెట్టే ఈ కేసుల్లో రెండు వర్గాలు తర్వాత రాజీపడుతుంటాయి. ఇకపై ఇలాంటి రాజీలకు ఆస్కారం లేదు. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లో నూతనంగా చేసిన సవరణల ప్రకారం రాజీలను ఆమోదించరు. గత సంవత్సరం చివరిలోనే దీనికి సంబంధించి కేంద్రం అంగీకారం లభించినా జిల్లా కోర్టుకు ఈ ఉత్తర్వులు ఆలస్యంగా

## క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లో మార్పు

అందాయి. సెక్షన్ 324 క్రింద నమోదుచేసే కేసులతోపాటు మహిళను అగౌరపరచడం, అవమానించడం లాంటి కేసులకు సంబంధించి సెక్షన్ 354 నమోదయ్యే వాటికి, భార్యలను వేధించడం తదితర ఫిర్యాదులతో నమోదుచేసే సెక్షన్ 498 కేసులకు లోక్ అదాలత్, సంబంధిత కోర్టుల్లో రాజీపడే అవకాశం వుండదు. ఒకసారి ఈ సెక్షన్ల క్రింద కేసు నమోదైనట్లైతే కోర్టులో కేసులు నడుపుకోవాల్సిందే.



డివైడర్ దాటడం సాహసమే.

# రోడ్డు దాటడం కష్టం!

నగరంలో రోజురోజుకు పెరుగుతున్న ట్రాఫిక్ కారణంగా పాదచారులు రోడ్డు దాటాలంటే కష్టంగా మారింది. కళ్లాల్లేని గుర్రాల్లా దౌడుతీస్తున్న వాహనాల నుంచి తప్పించుకొని రోడ్డు దాటలేక అగచాట్లు పడాల్సి వస్తుంది. గాంధీబొమ్మ నుంచి విఆర్‌సి వరకు రోడ్డు మధ్యలో డివైడర్లు ఏర్పాటుచేశారు. టౌన్‌హాలు, మూడు హాళ్ల వీధి, పొగతోట, సండేమార్కెట్ వద్ద రోడ్డు దాటేందుకు వీలు కల్పించారు. అంత వరకు బాగానేవున్నా మునిసిపల్ సిబ్బంది అనాలోచితంగా ఏర్పాటుచేసిన పైపులు పాదచారుల పాలిట శాపంగా మారి

## డివైడర్ల వద్ద జారుతున్న జనం

వున్నాయి. రోడ్డు క్రాస్‌చేసే చోట పైపులు వుండటంతో వాటిపై మెట్లలాగా సిమెంట్ వెయ్యాల్సిందిపోయి ఏటవాలుగా కంకరను వేయడంతో కాలుపెడితే జారిపోతుండడంతో పలువురు ప్రమాదాలకు గురౌతున్నారు. ముఖ్యంగా వృద్ధులు, పిల్లలు రోడ్డును దాటాలన్నా ఆలోచనలో ఏమాత్రం ఏమరపాటుగా వ్యవహరించినా కాలుజారి వేగంగా వస్తున్న వాహనాల క్రిందపడే ప్రమాదం పొంచి వుంది. అసలే అస్తుబిస్తుగా వున్న ట్రాఫిక్ వలన పలు సమస్యలు ఎదుర్కొంటున్న నగర ప్రజలకు రోడ్డునుదాటే సమయంలో ఎదురౌతున్న సమస్యలు ప్రాణాల మీదకు తెస్తున్నాయి.

# సాక్షర భారత్‌కు సన్నాహాలు పూర్తి!

జిల్లాలోని గ్రామీణ ప్రాంతాలలో ప్రతిష్టాత్మకంగా సాక్షర భారత్ కార్యక్రమాన్ని నిర్వహించేందుకు సన్నాహాలు జరుగుతున్నాయి. పంచాయితీరాజ్ సంస్థల ఆధ్వర్యంలో నిర్వహించే ఈ కార్యక్రమానికి జిల్లా పరిషత్ ఛైర్మన్ అధ్యక్షుడిగాను, జిల్లా కలెక్టర్ కన్వీనర్‌గానూ వ్యవహరిస్తారు. కేంద్ర ప్రభుత్వ నిధులతో అమలుచేసే ఈ పథకం జిల్లాలో 961 గ్రామ పంచాయితీల పరిధిలో వయోజన విద్యాకేంద్రాలలో నిర్వహిస్తారు. నిర్లక్షరాస్యులుగా వున్న ఎస్సీ, ఎస్టీలను ఈ కార్యక్రమంలో అక్షరాస్యులుగా తీర్చిదిద్దుతారు.

మండల, గ్రామస్థాయిలో కమిటీలను ఏర్పాటుచేయడంతోపాటు కో–ఆర్డినేటర్లను ఎంపికచేసే పనిలో నిమగ్నమై వున్నారు. ఈ కమిటీల ఏర్పాటు తర్వాత గ్రామస్థాయిలో సర్వే కార్యక్రమం చేపడతారు. స్వచ్ఛంద సంస్థల ప్రతినిధి, సాంఘిక సేవ కార్యకర్త, విద్యావంతులను

## 30 కోట్ల నిధులు విడుదల

కమిటీలో చేర్చుతారు. ఇప్పటికే సాక్షర భారత్ కార్యక్రమానికి 30 కోట్ల రూపాయలు మంజూరయ్యాయి. అక్షరాలు నేర్చుకునే వారికి 270 రూపాయలు, ఒక్కొక్క కేంద్రానికి 25 వేల రూపాయల వంతున ఖర్చు చేయనున్నారు. ఈ కార్యక్రమం ద్వారా నూతన అక్షరాస్యులు, మిగిలిన వారి సంపాదన, జీవన పరిస్థితులను మెరుగు పరిచేందుకు అవసరమైన వృత్తినైపుణ్యతను అభివృద్ధి పరిచే కార్యక్రమాలు రూపొందిస్తారు.

15 సంవత్సవరాలు వయసు నిండినవారు ఈ కార్యక్రమానికి అర్హులు. ఈ కార్యక్రమం అమలు కోసం మండల, గ్రామస్థాయిలో మరింత ప్రచారం కల్పించి విద్యను అందించాల్సిన అవసరం ఎంతైనా వుంది.



అంబేద్కర్ జయంతి సభలో మాట్లాడుతున్న ప్రొఫెసర్ కంచి ఐలయ్య.

# దళితులు సంఘటితం కావాలి

రాష్ట్రంలోని దళితులందరూ సంఘటితంగా వుంటే హక్కులను కాపాడుకోవచ్చని ఉస్మానియా యూనివర్శిటీ ప్రొఫెసర్ కంచి ఐలయ్య అన్నారు. 18వ తేదిన నగరంలోని విఆర్‌సి మైదానంలో జరిగిన అంబేద్కర్ 120వ జయంతోత్సవంలో ఆయన పాల్గొని ప్రసంగించారు. ఎన్నో సంవత్సరాల నుంచి ప్రభుత్వం, పాలకులు ఎస్సీ, ఎస్టీ, బిసి, మైనార్టీల సంక్షేమం పట్ల చాలా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తూ వస్తున్నారని విమర్శించారు.

ఎవరి హక్కుల కోసం అంబేద్కర్ రాజ్యాంగం రూపొందించారో అటువంటి వారి హక్కులకు భంగం కలుగుతున్నా చట్టాలు, కోర్టులు ఏమీచేయలేక పోతున్నాయని ఆవేదన చెందారు. జనాభాలో 80 శాతం వున్న ఎస్సీ, ఎస్టీ, బిసి, మైనార్టీలు 20 శాతం వున్న అగ్రకులాల వారు చెప్పినవిధంగా నడుచుకోవాల్సిన దుస్థితి ఏర్పడిందన్నారు. దళితులు ఐక్యంగా వుంటే తమ ఆటలు సాగనివ్వరన్న ఉద్దేశ్యంతో ఉపకులాల మధ్య చిచ్చుపెట్టి తమ పబ్బం గడుపుకుంటున్నారని ఆరోపించారు. ప్రభుత్వంలోని అన్ని శాఖలలో ఎస్సీ, ఎస్టీల సంక్షేమ కోసం కేటాయించిన నిధులు ఖర్చు చేయడం లేదన్నారు. దళితుల కన్నీళ్లు తుడిచేందుకు గొర్రెలు, మేకలు అందించి ఏదో చేస్తున్నామని ప్రచారం చేయించుకుంటున్నారని పాలకులపై ధ్వజమెత్తారు. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం వైపు దూసుకెళ్తున్న నేటి తరుణంలో అనేక గ్రామాలలో అంటరానితనం అమలవుతుండడం బాధాకరంగా వుందన్నారు.



నెల్లూరు జైన్‌గోల్డ్‌లో వారాంతపు డ్రాలో విజేతను లక్కీడ్రా ద్వారా తీస్తున్న మన్నెమాల వెంకటస్వామి, ప్రక్కన షోరూం ఛైర్మన్ మణిలాల్ జైన్, ఎం.డి.నరేంద్రజైన్.



సర్వేపల్లి మాజీ ఎమ్మెల్యే చెన్నారెడ్డి పెంచలరెడ్డి కుమారుడు హర్షవర్ధన్, రాఘవిల వివాహం ఏప్రెల్ 9వ తేది నెల్లూరు సిపిఆర్ కళ్యాణ మండపంలో జరిగింది.

## మళ్లీ జగడం

16వ పేజీ కొరవ

వ్యతిరేకత వుంది కాబట్టి డిజైన్ పునఃసమీక్ష జరుపు తామని చెప్తున్నాడు ముఖ్యమంత్రి. దీనిపట్ల తెలం గాణవాదులు, కమ్యూనిస్టులు మొదట నుంచి వ్యతిరేకంగా వున్నారు. కానీ వైఎస్ వారిని ఎంత మాత్రం లెక్క చేయలేదు. ఒకసారి జాతీయ హోదా ఆమోదం దశకు చేరుకొన్న ప్రాజెక్ట్ డిజైన్ మార్చడం అంటే మొత్తం కథ మళ్లీ మొదటికి తేవడమే లెక్క.

తాను లాభపడతానన్న అక్కసుతోనే రోశయ్య ఈ ఆలోచన చేస్తున్నాడని వైఎస్.జగన్ మండి పడుతున్నాడు. నెలరోజుల క్రితం వారిద్దరి మధ్య సంధి కుదిర్చాడు కెవిపి రామచంద్రరావు. అందుకు ప్రతిఫలంగా కృష్ణపట్నం పోర్టు యాజమాన్యానికి మచిలీపట్నం పోర్టు పెత్తనం వశం చేశాడు ముఖ్య మంత్రి. ఆ లావాదేవీలో జగన్‌కు స్వంత ప్రయోజ నాలున్నాయన్న వాస్తవం లోకానికంతా తెలుసు. దీనితో ఇద్దరి మధ్య రాజీ కుదిరిపోయిందని, జగన్, కెవిపిల హవా మరొకసారి రాష్ట్రంలో చలామణి కానున్నదని పరిశీలకులు భావించారు. అయితే ఆ వెంటనే జరిగిన ఓదార్పు యాత్రలో వైఎస్.జగన్ ప్రసంగాల తీరు ముఖ్యమంత్రిని బాధించాయి. తాను మాట్లాడిన ప్రతి సభలో, రాష్ట్రానికి త్వరలో స్వర్ణయుగం రానున్నదని ప్రకటించాడు జగన్. దానిఅర్థం ఇప్పుడు నడుస్తున్నది రాక్షస పాలనా అని ఆవేశపడ్డాడు రోశయ్య. తాను ముఖ్యమంత్రి అయితేనే రాష్ట్రంలో మెరుగైన పాలన వస్తుందన్న అర్థంలోనే జగన్ స్వర్ణయుగం ప్రస్తావన చేశాడన్నది రోశయ్య కోపానికి కారణం. ఈ విషయాన్ని ఆయన తన మనసులో దాచుకోలేదు. జగన్ అనుకూలురైన మంత్రుల వద్ద తీవ్ర స్వరంతోనే మాట్లాడాడు.

పోలవరం టెండరును ఇంకా వాయిదా వేయాలన్న ప్రభుత్వ నిర్ణయాన్ని జగన్ జీర్ణించు కోలేక పోతున్నాడు. ఆ టెండర్ ఆయన చేతికి వస్తే వేలకోట్ల రూపాయల లాభం మిగులుతుంది. అంత లాభం చేతికి అందకుండా పోవడం ఆయనకు సహ్యం కావడం లేదు. దానితో రోశయ్యతో మళ్లీ ముఖాముఖీ యుద్ధానికి సిద్ధపడుతున్నాడు. సాక్షి పత్రికలో ఆ ప్రక్కరోజు నుంచే ప్రభుత్వాన్ని విమ ర్శించే వార్తలు ప్రచురితం అవుతున్నాయి. వీరి జగడం రాష్ట్ర రాజకీయాలను ఏ మలుపులు తిప్ప నుందో కాలమే నిర్ణయించాలి.

## జెసి మీద భారం

మొదటి పేజీ కొరవ

లేదన్న ప్రచారం సృష్టించడానికి వీలు దొరుకు తుంది. శ్రీకృష్ణ కమిటీ నివేదిక వల్ల వచ్చే ప్రభా వాలను ఉపశమింప చేయడానికి చాలా ఉపకరి స్తుందది. అందువల్లనే ఈ ఉపఎన్నికలను ప్రతిష్టా సమస్యగా భావిస్తున్నాడు ముఖ్యమంత్రి. ఆ బాధ్యత తనకు ఎంతో నమ్మకస్తుడైన జెసి మీద పెట్టాడు. అందులో దివాకర్‌రెడ్డి ఎంతవరకు సఫలీకృతుడా తాడో వేచి చూడాలి.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

### ప్రజాపథం సభ దగ్గర వెంకట రమణారెడ్డి!

19వ తేది నెల్లూరు నగరంలోని నాల్గవ డివి జన్‌లో జరిగిన ప్రజాపథం కార్యక్రమంలో మునిసి పల్ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, నగర ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధరకృష్ణారెడ్డి, ఆనం వివేకానందరెడ్డి పాల్గొన్నారు. ఈ కార్యక్రమం వద్ద ముంగమూరు శ్రీధరకృష్ణారెడ్డిని కలవను వెళ్లిన ఆనం వెంకటరమణారెడ్డి ఆయన స్టేజిపై వుండ డంతో కాసేపు అక్కడే వేచి వుండడం రాజకీయ వర్గాల్లో చర్చకు దారితీసింది.

### ఢిల్లీ సదస్సుకు జడ్పీఛైర్మన్

కేంద్ర పంచాయితీరాజ్ శాఖ నేతృత్వంలో ఈ నెల 23, 24 తేదీల్లో ఢిల్లీలో పంచాయితీల దిశ – దశ అనే అంశంపై జరిగే సదస్సులో పాల్గొనమని జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డికి ఆహ్వానమం దింది. రాష్ట్రం నుంచి ఈ సదస్సుకు పది మంది జడ్పీ ఛైర్మన్లు హాజరవుతారు.

## విస్తరణ హుళక్కే

మొదటి పేజీ కొరవ

తప్పదు. తీసేసిన మంత్రులను చేరదీసి, రెచ్చగొట్ట డానికి జగన్ సిద్ధంగా వున్నాడు. ఆయన శిబిరం కళకళ లాడుతుంది. మరొకప్రక్క మంత్రివర్గ ఆశా వహులందరినీ సంతృప్తి పరచడం జరిగే పనికాదు. ఎందరికి ఇస్తే, ఇంక అంత మంది అలుగుతారు. వారి నుంచి తనకు సహకారం లభించదు. ఈ గోల అంతా తప్పాలంటే, మంత్రివర్గం జోలికి వెళ్లక పోవడమే ఉత్తమం.అయితే తన మనుషులనే వారు లేకుండా ఎంతకాలం వైఎస్ మంత్రులతో ప్రభు త్వాన్ని నడపాలన్న అసంతృప్తి కూడా వుంది ముఖ్య మంత్రిలో. కనీసం మునిసిపల్ ఎన్నికల వరకైనా వైఎస్ మంత్రులతో సర్దుకపోయి, ఆ తర్వాత తన వారిని తీసుకోవచ్చుననే అభిప్రాయంలో ఆయన వున్నట్లు ఆంతరంగికులు చెప్తున్నారు.

## జనవాణి

2వ పేజీ కొరవ

రెడ్డి, చీళ్ల గురునాధం వున్నారు. కాని వీరి విగ్రహా లకు బదులు నెల్లూరు బయట రాష్ట్రాలకు చెందిన నాయకుల విగ్రహావిష్కరణలు చేయడం సబబా? నేతలు ఈ విషయమై కాస్త ఆలోచించమనవి.

తూపిలి వనమాలి, నెల్లూరు

### తొలి తెలుగు కథ!

1903లో ఆచంట వెంకట సాంఖ్యాయన శర్మ లలిత, విశాఖ, సారసిక కథలను వ్రాశారు. వీటి లోని 'లలిత'ను తొలికథగా ఆరుద్ర తన 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' పరిశోధన గ్రంథంలో పేర్కొ న్నారు. ఆ తర్వాత 1910లో గురజాడ అప్పారావు వ్రాసిన 'దిద్దుబాటు' కథనే సాహితీ విమర్శకులు తొలి ఉత్తమకథగా నిర్ధారించారు. పై ఇద్దరికన్నా చాలాముందుగా 1855 ప్రాంతంలో నెల్లూరీయుడు నేలటూరి వెంకటరమణయ్య పంతులు వురఫ్ తాతా చారి తన కథల సంపుటిని ప్రచురించిన మాట నిజం. తొలినాటి కథలుగా తాతాచారి కథలకు ప్రాచు ర్యం రాకపోవడం దురదృష్టం. తాతాచారి కథలను వెలుగులోకి తెచ్చిన ఫైర్‌బ్రాండ్ 'బంగోరె' ఈ అం శంపై ఎందుకు నిఘా పెట్టలేదో తెలియదు.

ఎం.రామమూర్తి, విశాఖపట్నం

### రైతులను నాశనం చేశారు!

నెల్లూరు సన్నాలు రకం ధాన్యంపై నల్లమచ్చ వుందంటూ దీని కొనుగోలుకు ఎఫ్‌సిఐ నిరాక రించింది. మిల్లర్లు, మిగిలిన ధాన్యం వ్యాపారులు దీన్నిసాకుగా చూపి అతి తక్కువధరకు ధాన్యాన్ని కొనేసి దాచేశారు. నల్లమచ్చ వ్యవహారమై అటు అధికారపక్షం, ఇటు విపక్షం, రైతు సంఘాల నాయ కులు చేసింది శూన్యం. దీనిమూలంగా ఈ యేదాది నెల్లూరు రైతులు 400 కోట్ల రూపాయలకు పైగా నష్టపోయారు. దీనికి ఎవరు బాధ్యత వహిస్తారు?

పి.ఆర్.రెడ్డి, నెల్లూరు

## డిఎస్ రుసరుస

మొదటి పేజీ కొరవ

తెరవెనుక నడిపిన మంత్రాంగమే కారణమని డిఎస్ అనుమానం. దానితో ఆయన ముఖ్యమంత్రి మీద కారాలు మిరియాలు నూరుతున్నాడు.

ఇదిట్లా వుంటే, ప్రజాపథంలో తెలంగాణ ప్రాంతం ఎమ్మెల్యేలు చురుకుగా పాల్గొనేట్లు చూడా లని ఇటీవల ముఖ్యమంత్రి నుంచి డిఎస్‌కు ఫోన్ సందేశం అందింది. ఆ మాట ఆయనకు ఒంటి మీద కారం రాచినట్లయ్యింది. నేనేమైనా తెలంగాణ ప్రాంతానికి మాత్రమే పిసిసి అధ్యక్షుడినా, ఆ ప్రాం తం ఎమ్మెల్యేలతో మాత్రమే మాట్లాడాలని చెప్ప డంలో ముఖ్యమంత్రి ఉద్దేశం ఏమిటి అని రుసరుస లాడుతున్నాడు డిఎస్. ఆంతరంగికులతో మాట్లాడే టప్పుడు, విలేకరులతో ఆఫ్ ది రికార్డు సంభాషణ లలో సిఎం మీద తనకున్న అసంతృప్తిని బాహాటం గానే వెళ్లగ్రక్కుతున్నాడు. వైఎస్ వున్నప్పుడు కూడా కార్పొరేషన్ పదవుల వంటివి భర్తీ చేయాలంటే, నాతో ఒక మాట చెప్పేవాడు. కానీ రోశయ్య మాత్రం తన పాటికి తాను తనకు నచ్చిన వారికి పదవులు ఇచ్చుకొంటూ పోతున్నాడు. ఆయన ద్వారా పదవులు పొందినవారిలో కాంగ్రెస్ కార్యకర్తలే లేరు. అంతా స్వంత మనుషులు. ఏమిటీ అన్యాయం అని విలేకరుల ముందు వాపోతున్నాడు డిఎస్.

# జీవనోపాధి కోల్పోయిన రోడ్డు మార్జిన్ వ్యాపారులు!

నెల్లూరు నగరంలోని ఎ.సి కూరగాయల మార్కెట్ బయట కూరగాయలు, ఆకుకూరల వ్యాపారం చేసుకొంటున్నవారిని ట్రాఫిక్‌కు అంతరాయం కలిగిస్తున్నారన్న నెపంతో ఇటీవల పోలీసులు అక్కడ నుంచి తొలగించారు. రోడ్డు ప్రక్కన వ్యాపారం చేసుకుంటున్న వారిని సమాచారం లేకుండానే తొలగించడంతో గత పది రోజుల నుంచి జీవనోపాధి కోల్పోయారు. వీళ్లంతా గ్రామీణ ప్రాంతాల నుంచి కూరగాయలు తెచ్చుకొని మార్కెట్ బయట విక్రయించుకుంటారు.

జిల్లా ఎస్పీగా బాధ్యతలు స్వీకరించిన దామోదర్ నగరంలోని ట్రాఫిక్‌పై ప్రధానంగా దృష్టి సారించారు. మద్రాసు బస్టాండ్ వద్ద రోడ్డు మార్జిన్‌లో కూరగాయల వ్యాపారం నిర్వహించే చిన్న వ్యాపారులను తొలగించమని పోలీసుల్ని ఆదేశించారు. ఇక్కడ వ్యాపారం నిర్వహిస్తున్న వారిని ఫత్తేఖాన్‌పేటలోనున్న రైతుబజార్‌లో షాపులు కేటాయిస్తామని అధికారులు చెబుతున్నారు. ట్రాఫిక్‌కు ఎటువంటి అంతరాయం ఏర్పడకుండా వ్యాపారం చేసుకుంటున్న తమను అక్కడ నుంచి తొలగించడం అన్యాయమని బాధితులు వాపోతున్నారు. ఈ విషయంపై జిల్లా కలెక్టర్‌ను కలసినా కూడా స్పష్టమైన హామీ రాకపోవడంతో ఆందోళన చెందుతున్నారు.



కలెక్టరేట్ వద్ద ధర్నా చేస్తున్న ఎసి మార్కెట్ రోడ్డు మార్జిన్ వ్యాపారస్తులు.

వ్యాపారాలు చేసి కుటుంబాలను పోషించుకుంటున్న వారు ప్రస్తుతం ఉపాధి లేక విలవిలలాడుతున్నారు. గ్రామీణ ప్రాంతాలలో పండించిన కూరగాయలు, ఆకుకూరలు ఇతర ప్రాంతాలకు తీసుకెళ్లి కొందరు విక్రయించుకుంటుండగా, మరికొందరు ఎ.సి కూరగాయల మార్కెట్లోని పెద్ద వ్యాపారులకు తక్కువ ధరకు విక్రయించుకుంటున్నారు. ఓ 200 మంది మాత్రం మార్కెట్ బయట కూరగాయల బుట్టలు పెట్టి విక్రయించుకోవడం మార్కెట్ పెట్టినప్పటి నుంచి వుంది. పోలీసులు, మార్కెటింగ్‌శాఖ అధికారులు, జిల్లాకలెక్టర్‌లు ఒకరిపై ఒకరు చెప్పుకుంటూ సమస్యను పరిష్కరించకుండా కాలయాపన చేస్తూ వస్తున్నారు. మార్కెట్ ప్రక్కనే వున్న కోనేరు స్థలంలో వ్యాపారాలు నిర్వహించుకునేందుకు అవకాశం ఇవ్వాలని చిరు వ్యాపారులు కోరుతున్నా అధికారులు స్పందించడం లేదు.

ఈ నేపథ్యంలో గత పది రోజుల నుంచి వ్యాపారాలు మానేసి ఆందోళన చెందుతున్న చిరు వ్యాపారులు వెల్లడించిన అభిప్రాయాలు ప్రక్కనిస్తున్నాం.

### ప్రభుత్వం ఆదుకోవాలి!

ఎన్నో సంవత్సరాల నుంచి కూరగాయల మార్కెట్ బయట వ్యాపారం చేసుకుంటున్న వారిని ఇటీవల తొలగించారు. ట్రాఫిక్‌కు ఎటువంటి అంతరాయం ఏర్పడకుండా వ్యాపారాలు కొనసాగిస్తామని అధికారులకు విన్నవించుకున్నా పట్టించుకోవడం లేదు. ప్రభుత్వం మమ్మల్ని ఆదుకోవాల్సిన అవసరం వుంది.

– నరసమ్మ.

### కోనేరు స్థలం కేటాయించాలి

కూరగాయల మార్కెట్ బయట వ్యాపారం నిర్వహించే వారిని ఇటీవల అధికారులు ఇక్కడ నుంచి తొలగించారు. గత పది రోజుల నుంచి వ్యాపారాలు లేక ఆర్థికంగా ఎంతో నష్టపోయాం. కోనేరు స్థలంలో కొంత భాగాన్ని మాకు కేటాయిస్తే వ్యాపారం చేసుకుని జీవిస్తాం.

– జయమ్మ.

# విశ్వవిజ్ఞానాన్ని అందించేది పుస్తకం!




విజ్ఞానాన్ని అందించేది పుస్తకం. మనిషి యొక్క జిజ్ఞాస పుస్తకం నుంచే ప్రారంభమవుతుంది. విశ్వంలోని విజ్ఞానాగని పుస్తకం. పుస్తకాలను చదవడం ద్వారా సమాజం గురించి, సభ్యత, సంస్కారం గురించి తెలుసుకొంటారు. నడవడికలను, మంచి అలవాట్లను నేర్చుకొంటారు. చదువుకోవడం ద్వారానే ఇది సాధ్యమవుతుంది. విద్య లేనివాడు వింత పశువు అని పెద్దలు అందుకే అన్నారు. మంచి పుస్తకాలను, సాహిత్యాన్ని చదవడం వలన మనిషి మహోన్నతుడవుతాడు. చిరిగిన చొక్కా అయినా వేసుకోకానీ మంచి పుస్తకం మాత్రం కొనుక్కో అని కందుకూరి వీరేశలింగంపంతులు చెప్పిన మాటలు నిజంగా అక్షర లక్షలే.

మనిషిలోని స్తబ్ధతను కరిగించి, విజ్ఞతను కలిగించి, విచక్షణ పెంచి, స్వయం నిర్ణయాధికార శక్తిని, స్థితప్రజ్ఞతను కలిగించేదే పుస్తకం. తెలుగులో ఎందరో రచయితలు తమ సాహిత్యం ద్వారా సమాజాన్ని ప్రభావితం చేశారు. ఆ రచనలను చదవడం వలన పఠనా శక్తి పెంపొందడంతో పాటు ప్రభావితం అవుతాడు మనిషి. మనిషి యొక్క జిజ్ఞాన పుస్తకం నుంచే ప్రారంభమవుతుంది. చిన్నప్పుడు చదువుకున్న పెద్దబాలశిక్షను తొలి పుస్తకం అనాలి. ఎన్నో విషయాల్ని, ఎంతో ఆసక్తికరంగా తెలియజెప్పిన పెద్దబాల శిక్షని మరచిపోయే తెలుగువాడంటూ వుండడు. ఇప్పుడు ఇంగ్లీషు మీడియం వచ్చి, మమ్మీ, డాడి సంస్కృతి వచ్చిన తర్వాత పిల్లలంతా రైమ్స్ అంటూ పాడుతుంటే చిన్ననాడు నేర్చుకున్న చేత వెన్నముద్ద చెంగల్వపూదండలోని సువాసనలు మరువలేనివి.

సాంకేతికంగా ఎంతో అభివృద్ధి సాధించినా, కంప్యూటర్లు, ఇంటర్నెట్ వాడకం, సిడిల వినియోగం ఎంతగా పెరిగినా పుస్తకానిది మాత్రం ఎప్పుడూ పైచేయి. దాని ప్రత్యేకత ఎల్లలు లేనిది. అరచేతిలో ఇమిడే పుస్తకం ఎక్కడికైనా తీసుకొనిపోయేందుకు సౌకర్యంగా వుంటుంది. ప్రయాణాల్లో, కాలక్షేపానికి పుస్తకాన్ని మించింది మరొకటి లేదు. ఎంత పెద్ద చదువైనా, విశ్వమంత విజ్ఞానమైనా పుస్తకాల్లో ఒదిగిపోతుంది. సంపన్నుల నుంచి సామాన్యుని వరకు, పండితుని నుంచి పామరుడి వరకు పుస్తకం అందరికి అందుబాటులో వుంటుంది. మంచి పుస్తకాన్ని కొని చదవడంతోపాటు ఇంట్లో వుంచుకోవడం వలన తీరిక సమయాల్లో ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని కల్గించడంతోపాటు ఇంటికొచ్చే అతిథులకు తోడుగా వుంటుంది పుస్తకం.

● జగన్ రోశయ్యల మధ్య

# మళ్లీ జగడం!

పోలవరం ప్రాజెక్ట్ డిజైన్ తీరుతెన్నులను పునఃసమీక్షించాలని ముఖ్యమంత్రి రోశయ్య తీసుకొన్న నిర్ణయం ఆయనకు, వైఎస్ జగన్‌కు మధ్య మరొక రసవత్తర సంవాదానికి తెరలేపుతున్నది. ఈ ప్రాజెక్ట్ తన కలగా అభివర్ణించాడు వైఎస్.రాజశేఖర్‌రెడ్డి. దానికి అనుమతులు తేవడానికి ఆయన చేయని ప్రయత్నం లేదు. చత్తీస్‌ఘడ్, ఒరిస్సా రాష్ట్రాల అభ్యంతరాలు తప్ప, తతిమా అడ్డంకులన్నీ వైఎస్ బ్రతికి వుండగానే తొలగిపోయాయి. దానికి జాతీయ ప్రాజెక్ట్ హోదా కల్పించడానికి ప్రధానమంత్రిని కూడా ఒప్పించాడు అప్పట్లో. అయితే ఇందులో రెండు అంశాలు ఇమిడి వున్నాయి. మొదటిది – పోలవరం ద్వారా గోదావరి నీటిని కృష్ణానదికి మళ్లించి, అంతే మేర కృష్ణానీటిని రాయలసీమ బీడు భూములను సస్యశ్యామలం చేయాలన్న మహత్తర ఆశయం. తనకు జన్మనిచ్చిన రాయలసీమలో కరవు కాటకాలు తొలగాలంటే, పుష్కలంగా నీటిపారుదల వసతులు పెంచాలన్నది వైఎస్ ఉద్దేశం. దాన్ని తన జన్మసార్ధకతగా భావించారాయన. అందువల్ల ఎవరెన్ని అభ్యంతరాలు చెప్పినా, ఎంత గోల చేసినా లెక్క చేయకుండా రాయలసీమలో లెక్కలేనన్ని నీటి పారుదల ప్రాజెక్ట్‌ల నిర్మాణం చేపట్టాడు. పోతిరెడ్డిపాడు హెడ్‌రెగ్యులేటర్ ద్వారా కృష్ణ వరద నీటిని మళ్లించడానికి ఏర్పాటు చేశాడు. అయితే కేవలం కృష్ణా నది మిగులు జలాలు, వరదల మీద అధారపడితే, రాయలసీమకు నికరమైన నీటి వసతి కల్పించడం కష్టమన్న నిజం ఆయనకు తెలుసు. కృష్ణా నదికి నాలుగేళ్లకు ఒకసారి మాత్రమే వరద వస్తుంది. తతిమా సమయంలో ఆ నదిలో ప్రవహించే నీటికి సరిపడా కృష్ణా డెల్టా అభివృద్ధి చెంది వుంది. అందువల్ల కరవు సంవత్సరాలలో రాయలసీమకు నీళ్లివ్వడానికి కృష్ణా డెల్టా రైతాంగం రైపేరియన్ హక్కుల ప్రాతిపదికన అభ్యంతరం చెప్తుంది. అది నీళ్ల యుద్ధానికి దారితీస్తుంది. నికర జలాలు లేకుండా తాను రాయలసీమకు చేసే ప్రయోజనం వ్యర్థమన్న భావనతోనే పోలవరం ప్రాజెక్ట్ తలపెట్టాడు వైఎస్. మొదట్లో దానిపట్ల తీవ్ర వ్యతిరేకత వచ్చింది. 2004 ఎన్నికలలో మిత్రపక్షాలుగా కలిసి నడిచిన కమ్యూనిస్టులు, ఆ వెంటనే శత్రువులుగా మారడానికి కారణం పోలవరం ప్రాజెక్ట్ నిర్మాణ ప్రతిపాదనే కావడం గుర్తుంచుకోవాలి. అంతటి రాజకీయ ఒత్తిడిని కూడా భరించి, ఆ ప్రాజెక్ట్ నిర్మాణానికి పట్టుదల చూపాడు వైఎస్. దాన్నిబట్టే దానిపట్ల ఆయన ఆసక్తి, అనురక్తిని అర్థం చేసుకోవచ్చు.

## జగన్ వ్యాపార ప్రయోజనం

ఇందులో రెండవ అంశం – జగన్ వ్యాపార ప్రయోజనం. పోలవరం నిర్మాణానికి 2005 సంవత్సరంలోనే టెండర్లు పిలిచారు. పని అప్పచెప్పారు. అయితే ఆ తర్వాత దీనిపై జగన్ కన్ను పడింది. ఈ ప్రాజెక్ట్ కాంట్రాక్ట్ మొత్తాన్ని తన స్వంతం చేసుకోవాలని తలపోశాడు. అంతే క్షణాలలో ఏర్పాట్లు జరిగిపోయాయి. అప్పటికే టెండర్లు దక్కించుకొన్న కాంట్రాక్టర్లను వైఎస్ స్వయంగా పిలిపించి, ఆ పనులు వదులుకోమని సూచించాడు. ఆయన మాటకు ఎదురు చెప్పే పరిస్థితి లేకపోవడం, పైపెచ్చు రకరకాల అవాంతరాల వల్ల జాప్యం జరిగి నిర్మాణ ఖర్చు పెరిగిపోయి, నష్టాలలో వున్న కాంట్రాక్టర్లు అందుకు సిద్ధపడ్డారు. చరిత్రలో ఎన్నడూలేని విధంగా వారు పని వదులుకొన్నందుకు దాదాపు 450కోట్ల రూపాయల నష్టపరిహారం ఇచ్చేందుకు ప్రభుత్వ ఉత్తర్వులు జారీ చేశాడు వైఎస్. వారికి హామీగా 100 రూపాయల స్టాంప్ పత్రం మీద ఒప్పందం కుదిర్చాడు. ఆ వెంటనే ప్రాజెక్ట్ నిర్మాణ వ్యయం అంచనా మార్పు చేశారు. దానికి జల విద్యుత్ ప్రాజెక్ట్ కూడా జతచేసి, ఒకే టెండర్‌గా రూపొందించి అంచనాను మూడువేల కోట్ల నుంచి ఏకంగా 9వేల కోట్లకు పెంచారు.

## సోనియా ఆగ్రహం

వైఎస్ హెలికాప్టర్ ప్రమాదం జరిగిన రోజు, సెప్టెంబర్ 2తేది ఈ టెండర్‌ను ఆన్‌లైన్‌లో పెట్టాల్సి వుంది. అయితే ఆ ఉదయం నుంచే హెలికాప్టర్ ప్రమాద వార్తతో రాష్ట్రం అల్లకల్లోలం కావడంతో, అధికారులు కొంత ఆలస్యం చేశారు. వైఎస్ జాడ కనిపెట్టడానికి సెక్రటరియేట్‌లో ఏర్పాటుచేసిన కంట్రోల్ రూంలో వుండిన కెవిపి రామచంద్రరావు, అక్కడ నుంచే అధికారులకు ఫోన్‌చేసి, టెండర్‌ను ఆన్‌లైన్‌లో పెట్టారా లేదా అని వాకబు చేశాడు. అది విన్న ఢిల్లీ కాంగ్రెస్ నేతలు, టెండర్ల వ్యవహారాలు మాట్లాడుకోవడానికి ఇదా సమయం అని మందలించారు. ఆ వార్త సోనియాగాంధీ చెవిన కూడా పడింది. వైఎస్ వంటి నేత మరణించిన విషాద సమయంలో వ్యాపార వ్యవహారాలు చక్కబెట్టుకో చూడడం నీచమైన సంస్కృతిగా భావించిన ఆమె, పోలవరం టెండర్లను నిరవధికంగా వాయిదా వేయమని ముఖ్యమంత్రిని ఆదేశించారు.

పోలవరం ప్రాజెక్ట్ టెండర్‌కు ఇంత నేపథ్యం వుంది. ఇంత పెద్ద ప్రాజెక్ట్ జగన్ వశం కావడం రోశయ్యకు ఇష్టం లేదు. జగన్ కోసంగా దాని నిర్మాణవ్యయాన్ని మూడింతలు పెంచడం కూడా ఆయనకు ఇష్టం లేదు. దానితో మొదటి చర్యగా పోలవరం టెండర్ నుంచి జలవిద్యుత్ కేంద్రాన్ని విడదీశారు. ఇప్పుడు తాజాగా అసలు డిజైన్‌లోనే మార్పులు చేయాలని ప్రతిపాదించారు. ఇందుకోసం ఒక ఇంజనీరింగ్ నిపుణుల కమిటీని నియమించారు.

## వాయిదా?

దీని అర్థం పోలవరం ప్రాజెక్ట్ నిర్మాణాన్ని నిరవధికంగా వాయిదా వేయడం మాత్రమే. ఈ ప్రాజెక్ట్ పట్ల తెలంగాణ రాజకీయవాదులలో తీవ్ర

కొరవ 14వ పేజీలో



నెల్లూరు మినీ బైపాస్‌రోడ్డులోని శ్రవణ్య రెస్టారెంట్‌ను ప్రారంభిస్తున్న మంత్రి ఆనం రామనారాయణరెడ్డి. ప్రక్కన ఎమ్మెల్యేలు శ్రీధర్‌కృష్ణారెడ్డి, వివేకానందరెడ్డి, రెస్టారెంట్ అధినేతలు ఎం.రమణయ్య, యం.వెంకటేశ్వర్లు, ఎం.సురేంద్ర.

# తెలంగాణ నేతల్లో వణుకు!

● శ్రీకృష్ణ కమిటీ ముందు కుండబ్రద్దలు కొట్టినట్లు మాట్లాడిన మహబూబ్‌నగర్ జిల్లా ప్రజలు

శ్రీకృష్ణ కమిటీ సభ్యులతో మహబూబ్‌నగర్ సాధారణ ప్రజానీకం సంభాషించిన తీరు తెలంగాణ రాజకీయ వాదులను ఆశ్చర్యపరచింది. ప్రజాభిప్రాయ సేకరణలో భాగంగా కమిటీ సభ్యులు మొదటగా మహబూబ్‌నగర్ జిల్లాలో పర్యటించారు. తెలంగాణ వాదం అసలు లేని జిల్లాలలో ఖమ్మం తర్వాత మహబూబ్‌నగర్ అని ఇంతకాలం రాజకీయవాదులకు ఒక అభిప్రాయం వుండేది. ఆ జిల్లాలో టిఆర్‌ఎస్ ఎప్పుడు కూడా కనీసపాటి ఉనికి ప్రదర్శించలేకపోవడం అందుకు కారణం. పైపెచ్చు అటు కర్నూలు జిల్లాతో సంబంధాలు, ఇటు హైదరాబాద్ సిటీ పెరుగుదలలో ఒక భాగం కావడం వల్ల మహబూబ్‌నగర్ జిల్లా ప్రజలు తెలంగాణ ఏర్పాటుకు విముఖులని భావించేవారు. కానీ విచిత్రంగా దారిపక్కన పొలాలలో పని చేసుకొనే కూలీలు, రైసు మిల్లులలో పనిచేసే సగటు కార్మికులు కూడా శ్రీకృష్ణ కమిటీ సభ్యులతో కుండబ్రద్ధలు కొట్టినట్లు మాట్లాడారు. తెలంగాణ వస్తేనే తమ పొలాలకు నీరు, తమ బిడ్డలకు ఉద్యోగాలు వస్తాయని చెప్పారు. వారు అంత తేటతెల్లంగా అభిప్రాయం వెల్లడించడం ఆ కమిటీ సభ్యులనే ఆశ్చర్యపరచింది.

మహబూబ్‌నగర్ ప్రజలలోనే ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు పట్ల అంత వాంఛ వుంటే, కరీంనగర్, వరంగల్ వంటి జిల్లాలకు వెళ్లినప్పుడు ఇంకెంత తీవ్రస్వరంతో సానుకూలత వ్యక్తం చేస్తారో అర్థం చేసుకోవచ్చు. ఈ పరిణామం కాంగ్రెస్, తెలుగుదేశం నేతలను కలవరపరుస్తున్నదన్నది నిజం. తెలంగాణ నినాదం కెసిఆర్ బాకా మాత్రమే అన్న అభిప్రాయంతో ఇటీవల కొంతకాలంగా ఈ రెండు పార్టీల నేతలు ఉద్యమానికి దూరంగా మసలుతున్నారు. మంత్రిపదవుల మీద మోజుతో జానారెడ్డి వంటివారు కూడా ప్లేట్ ఫిరాయించారు. అయితే ప్రజలలో వ్యక్తమౌతున్న కోరికనుబట్టి చూస్తే మాత్రం, తెలంగాణ ఉద్యమానికి దూరంగా వుండడం రాజకీయ భవిష్యత్తును నాశనం చేసుకోవడమే అన్న భయం వారిలో కల్గిస్తున్నది.

మరొకప్రక్క శ్రీకృష్ణ కమిటీ నివేదికను, ఈ రకం ప్రజాభిప్రాయమే ఎక్కువగా ప్రభావితం చేస్తున్నదనడం నిజం. రాజకీయ పార్టీలు, సంస్థలు, నాయకులు ఇచ్చిన నివేదికలను వారు చదివి అర్థం చేసుకోవడం అసాధ్యం. దాదాపు 60 వేల నివేదికలు అందాయి కమిటీకి. వాటిని సమగ్రంగా చదవాలంటే ఏళ్లు పూళ్లు కాలం పడుతుంది. అందువల్ల వాటికంటే, ముఖాముఖిన తమకు ఎదురయ్యే అభిప్రాయాలనే కమిటీ సభ్యులు అధికంగా పరిగణనలోకి తీసుకొంటారు. తెలంగాణలో ఎక్కడకు వెళ్లినా వారికి ప్రజల కోరిక అదే అని తేలితే, నివేదికను కూడా అట్లనే ఇస్తారు.

ఆ పరిస్థితి ఆంధ్ర ప్రాంతంలో లేదు. ఆ ప్రాంతం ప్రజలకు ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు పట్ల స్పష్టమైన భావాలు లేవు. రాజకీయవాదులు తప్ప, సాధారణ జనం దాన్ని వ్యతిరేకించడం లేదు. అనుకూలించడమూ లేదు. అందువల్ల తెలంగాణ ప్రజలు చెప్పినంత బలీయంగా ఆంధ్ర ప్రాంతం జనం తమ అభిప్రాయాలను వ్యక్తం చేయరన్నది నిజం. ఈ పరిస్థితులలో శ్రీకృష్ణ కమిటీ నివేదిక తెలంగాణకు సానుకూలంగానే వచ్చే అవకాశాలు ఎక్కువ. కేంద్ర నేతలెవరైనా కమిటీ సభ్యులను ప్రభావితం చేస్తే తప్ప తుది నివేదిక ఆ తీరులోనే వుంటుందని తెలంగాణవాదులు భావిస్తున్నారు. అందువల్ల ఇప్పటినుంచే తాము మరొకసారి ఉద్యమంలో భాగస్వాములు కావడం మంచిదన్న ఆలోచనలు కలుగుతున్నాయి వారికి.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.